శ్రీ



# ప్రమీలార్జునీయము.

ఇది

బళ్లారిలోనుండిన డిస్ట్రిక్టుకోర్టువకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన

## ధర్మవరము - రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. క. కృష్ణమాచార్లు, వారిసహోదరులవల్ల ప్రకటింపబడియె.

మొదటి కూర్పు.

చెన్నపురి:

యస్. మూర్తి అన్డ్ కంపెనీవారి

కపాలి ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

1914



క్రయము రూ. 1-0-0.

"ఆంధ్రనాటక పితామహ" యనుబిరుదువహించిన
ధర్మవరము రామకృష్ణమాచార్యులవారిచే రచియింపబడిన
ఆంధ్రనాటక గ్రంథరత్నమాల.

---

1. చిత్రనళీయనాటకము.
2. విషాద సారంగధరనాటకము.
3. పాదుకాపట్టాభిషేకము.
4. సావిత్రి చిత్రాశ్వము.
5. ప్రహ్లాదనాటకము.
6. ప్రమీలార్జునీయనాటకము.
7. పాంచాలీ స్వయంవరనాటకము.
8. మోహినీరుక్మాంగద.
9. బృహన్నళనాటకము.
10. ముక్తావళినాటకము.
11. కుంభీనస (లేక) చంద్రహాసనాటకము.
12. స్వప్ననిరుద్ధనాటకము లేక ఉషాపరిణయము.
13. వరూధినినాటకము.
14. చిరకారినాటకము.
15. సుసీల జయపాలీయనాటకము.
16. అజామిళ (వచననాటకము.)
17. యుధిష్ఠిర యువరాజ్యనాటకము.
18. రోషనార.
19. సీతాస్వయంవరనాటకము.
20. ఘోషాయాత్ర.
21. మదన విలాసనాటకము.
22. ఉన్మాదరామ ప్రేక్షణీకనాటకము.
23. ఉదసా కల్యాణము.
24. రాజ్యాభిషేకము.
25. సుగ్రీవ పట్టాభిషేకము.
26. విభీషణ పట్టాభిషేకము లేక లంకాదహనము.
27. గిరిజ కల్యాణము.
28. హరిశ్చంద్రనాటకము.



కనడ నాటకములు.

29. స్వప్నానిరుద్ధము లేక ఉషాకల్యాణము.
30. ఉపేంద్రవిజయము లేక వామనచరిత్ర.

## Works of Late Mr. D. Krishnamacharlu "Andhra Nataka Pithamaha" Bellary.

1. Chitranaliya Natakam.
2. Vishadha Sarangadhara.
3. Paduka Pattabhishekam.
4. Savithri Chitraswam.
5. Prahlada Natakam.
6. Prameelarjunam.
7. Panchali Swayamvaram.
8. Mohini Rukmangada.
9. Bruhannala.
10. Mukthavali.
11. Kumbhinasa or Chandrahasa.
12. Swapna-anirudham or Oosha Parinayam.
13. Varudhini.
14. Chirakari.
15. Susila jayapaliyam.
16. Ajamila (A prose drama.)
17. Yudhistra-Yuvarajyam.
18. Roshinara.
19. Seetha Swayamvaram.
20. Ghosha-Yatra.
21. Madana Vilasam.
22. Oonnmadarama-Prekshanikam.
23. Oodasa Kalyanam.
24. Coronation drama or Rajyabhishekam.
25. Sugriva Pattabhishekam.
26. Vibhishana Pattabhishekam (or Lenka Dabanam)
27. Girija Kalyanam.
28. Harischandra

### Canarese Dramas.

29. Swapnanirudham or Ooshakalyanam.
30. Oopendra Vijayam or Vamana Charitram.

శ్రీ

# ప్రమీలార్జునీయనాటకము.

ఆంధ్రనాటక పితామహుండన నెన్నికఁగన్న రామకృష్ణకవి రచితనాటకంబుల నిదివఱకు నైదుముద్రితంబులయ్యె. ఆంధ్రభాషాభిమానులకు వానియెడఁగలవిశ్వాసము దినదినంబునకుఁ బ్రవృద్ధమానమగుటఁగని యాకవి బంధు మిత్రవర్గమున కెల్లఁ బ్రమోదంబొదవె. ప్రమీలార్జునీయమననాటకము నేఁడుముద్రాశాలనుండి వెలువడుచున్నయది. దీనియెడఁగూడ తొంటిపగిదిగౌరవంబొదవునని నమ్మియున్నారము. అక్కవిచేరచియింపఁబడిన యితరనాటకములు క్రమక్రమముగవెలువడఁగలవు.

బుధజనవిధేయుఁడు,

ధ. శేషాచార్యుఁడు.

చెన్నపురి.

26-12-14

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ప్రస్తావన.

శా॥ శ్రీవిఖ్యాతుఁడుపాండవేయమహదా ంబాపి యెవ్వాఁడు మో।
దావిర్భూతిబృహన్నలాదులకుఁ గష్టాజ్ఞాతసంవత్సరం।
బేవిభ్రాంతియులేకయుండఁ దగమాయించెఁ గృపాపూర్ణుఁడా।
దేవుండీవుతభక్తసంతతులకుఁ దీర్ఘాయురారోగ్యముల్ ॥

### ప్రథమాంకము-ప్రథమరంగము.

### హస్తిపురి-ధర్మజునియిల్లు.

[ప్రవేశము: మృత్యుంజయుఁడు, శతరూపుఁడు నను నిరువురు బ్రాహ్మణులు.]

మృత్యుం—శతరూపా! నీవేటికి రాజు నిట్లాడెదవు?

శత—నీమాట లింకఁజాలింపుము. సార్వభౌమ పదవికి వచ్చియున్నవాని కిట్టిదారిద్ర్యమా? ఏమేమో యిచ్చుఁగదాయని పేరాసతో వచ్చి యిక్కెట్లబడితిమి. ఇంకేమనవలయు?

మృత్యుం — సార్వభౌమ పదవికి వచ్చినమాత్రముననే ధనమెక్కడనుండివచ్చును? ఉన్నంతలోఁ దగినమట్టుకు దానముచేసియేయున్నాఁడు.

శత—మృత్యుంజయా! నీవిట్లాడిన నాకుఁగోపమువచ్చును. ఇన్నిదినములనుండి నిరంకుశప్రభుత్వము గలిగియున్న దుర్యోధనుని యైశ్వర్యమంతయు నేమాయెను? అది లేకుండిన, నెవ్వరినడిగిన రొక్కమివ్వరు? కాకున్న నెంతదండిగా సేకరించరాదు? ముఖ్యము ధర్మజుఁడు లుబ్ధుఁడు. కాకున్న వచ్చినవారివందఱిని వేర్వేరుగాఁగాల్పక నొక్కచితిని దివములకొలఁదిఁ గాల్పఁజేయునా?

మృత్యు—శతరూపా! నీ వా మహీవరుని నిట్లేటికిఁ దూలనాడెదవు? మహారణమున మృతిఁజెందిన యక్షౌహిణులకొలఁదిసంఖ్యగలరాజవర్యుల నొక్కరినొక్కరి దహింపఁ జేయుట సాధ్యమా? ఇదియు నొకతప్పా? దండుగలువట్టుటయు నప్పుగొనుటయు క్షేమరాజ్యమున కర్హములా? దుర్యోధనుఁడన్న ధనమంతయు వ్రయముచేసి యుద్ధమునకుఁబెట్టలేదా? ఈధర్మరాజు ననవలెనా?

శత—కానిమ్ము, నీ వారాజు నింతగాఁ బ్రశంసించెదవు. ఒక్కమాట- దీని కేముత్తర మిచ్చెదవు? కృష్ణుఁడు బావమఱఁదిగాఁడా? వాని నడిగిన నెంతధనమివ్వఁడు?

మృత్యు—అప్పుగా నేకదా? అట్లుఋణముచేయుట ధర్మముగాదు. అదిగో, నకులుఁడును భీముఁడును వచ్చుచున్నారు.

(ప్రవేశము: నకులుఁడు- భీముఁడు.)

నకులు—బ్రాహ్మణోత్తములారా! మీరిందేలయున్నారు? సదస్యులందఱుఁ జేరి ధర్మజు నాశీర్వ దించుచున్నారు.

శత—ఆసదస్సునుండియే వచ్చితిమి. వేదఘోషకును, నాశీర్వాదములకును, వినయములకును, విజ్ఞాపనములకును, విన్నాణములకును, వివేకములకును దక్కువ లేదు, గాని విశేషదక్షిణలకే యభావము. అందుకే మేమిందువచ్చితిమి.

నకుల—విప్రవతంసములారా! యుధిష్ఠిరుఁ డింతవఱకు విన్నవించెనే?' యిప్పుడు నిర్ధనుఁడనైయున్నాఁడ' ననియుఁ' నీఋణము నచిరకాలముననే పాపికొనుచున్నాఁడ' ననియు విన్నవింపఁడా? మీరలిగిన మాకేదిగతి? ఎట్లైనమన్నింపుఁడు.

శత—శుష్కోపచారములు, శూన్యహస్తములు—వి...

మృత్యుం—శతరూపా! నీకెంతటియవివేకము? ఎంతటిదురాశ? ప్రభువా! వీనికి దక్షిణ యందభిలాషయున్నట్లు దాక్షిణ్యమున నభిలాషలేదు. వీనిమాటలఁ బాటింపకుము.

భీముడు—నకులా! ఈబ్రాహ్మణులకేమిచ్చినను వీరికిఁ దృప్తిగలుగదు. అటుతృప్తులైన వీరికి దారిద్ర్యమేల కలుగు?

(ప్రవేశము: చారుఁడు.)

చారుఁడు—భీమరాజన్యా! దేవరతల్లియగు కుంతిమాత వృషకేతుమున్నిడికొని యేడ్చుచుండి పెనుమూర్ఛంజెందియున్నది. ధర్మజునితోడను నర్జునునితోడను విన్నవింప వారుపోవుచు మీకుఁదెలుపుమనిరి.

భీముఁడు—ఏమి? ఏమి? నకులా! మనముపోవుదము.

(నిష్క్ర)

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.

### ధర్మజునంతఃపురము.

ప్రవేశము: కుంతి (మూర్ఛిల్లి) ధర్మజ-భీమ-అర్జున-నకుల-సహదేవులు.

ధర్మ—అమ్మా! ఎన్నఁడులేని భంగినీకిదియేల గలిగె? అయ్యో! నీమోమున నిట్టిదైన్యము నిట్టిసంతాపము నెన్నఁడు నెఱుంగముకదా? ఏలయిట్లు దురపిల్లెదవు? నీవించుక మారుమాట వల్కకున్న మా ప్రాణములు నిలువవుకదా?

భీముఁడు—మాతా! ఇన్ని దినములుండిన మనసంకటములఁ బాపికొంటిమి. అరణ్యవాస దైన్యమును నజ్ఞాతవాసకష్టమును సంగ్రామజయశంకయు నిరాయాసముగఁ గడఁజేరె. ఇదెనాచేత ధార్తరాష్ట్రశతముఁజక్కాడితి. ఇవియన్నియుఁ బరమసంతోష కారకములుగా నీమోమువికాసభావముఁ జెందింప వలసినది మాని, విలాపభావము నెట్లు చెందింపఁజాలెను?

అర్జు—అమ్మా! ఎన్ని సంకటములకైన నోర్చికొంటివి. మమ్ముఁబాసి యేకతముననుండుటకుఁ దాళుకొంటివి. మేమరణ్యములనుండఁ జూచుటకోర్చుకొంటివి. బంధునాశమునకుఁ బ్రియపౌత్ర నష్టమునకైనఁ దాళుకొంటివి. ఇపుడీభంగి శోకింప నేమి కతము?

(అనుబంధము 1.)

కుంతి—తనూజులారా! నాకుఁగలపరితాప మింతయని చెప్పఁజాలను. అక్కటా! నేనెల మనియున్నదానను? ఏలనాహృదయము వ్రయ్యలుగాకున్నది? కుమారులారా! నే నే మని వచింతును?

అర్జు—అమ్మా! నీవిట్లాడిన మేమే మనగలము? అయ్యో! పరితాప మనియెదవుగాక, కారణముదెలుపవే? యుద్ధమునఁజచ్చిన మనవారికై దుఃఖించెదవన్న నదియంతయుఁ దుదముట్టి యిన్నిదినములాయెనే. ఇప్పుడేల యీశోకము?

కుంతి—హా! హా! కర్ణా!

అర్జు—ఆలోకకంటకుఁడగు కర్ణుపై జ్ఞాపకముకలిగి వాఁడొనర్చిన పరిభవములఁదలఁచి యిట్లు వందురుచున్నదికాఁబోలు. అమ్మా! ఆదురాత్ముఁడగు కర్ణుకొఱకు వగచెదవా? వాఁడొనర్చిన దుష్కృత్యములఫలము వాఁడనుభవింపఁడా? నాచేతులార నామనసార నాసోదరులు కన్నులారఁజూడ వానినుక్కడంచితినే యింకేల యీపరితాపము?

కుంతి—హా! దైవమా!—పాపాత్మా! నీవుగదా యాలోకైకవీరు నధర్మయుద్ధమున నేలకుఁదెచ్చితివి?

అర్జు—హా! హా! ఇదేమిమాట? అమ్మరో! ఆయాసురబీజుని నిక్లేటికిఁ గరుణింపనెంచెదు? దురాత్ముఁడై పాంచాలి నాసభలోనట్లాడి మాకెల్లఁజెప్పరానిసంకటములు కలిగించి యొక్కరు నభిమన్యుకుమారు నిరాయుధు దుష్టసంగ్రామమున నుక్కడంచిన యాక్రూరాత్మునిపైనీకేలయిట్టిప్రీతికలిగె? వానిఁబొలియించినందుకు నీకొడుకులనైనఁ గాదందువే? వాఁడు నీకేనాఁటిచుట్టము? నీకొడుకులకంటె వాఁడునీకెట్లెక్కుడయ్యె?

కుంతి—హా! కర్ణా! హా! కర్ణా! (మూర్ఛిల్లును.)

అందఱు—అయ్యో! ఇదేమి విపరీతము?

ధర్మ—అనుజులారా! మనకెట్టిప్రాప్తి? మాతా! నీవు మమ్మిట్లేలదుఃఖము పాలుచేసెదవు? నీసంతాపమునకుఁగారణము చెప్పెదవేని నెట్టిదుస్సాధ్యకార్యమునైనను సాధించి నీకుఁగీర్తిఁదెచ్చెదము. ఒండేని యే మిదె యరణ్యములకు మరలనేగెదము.

కుంతి—కుమారులారా! మీదుఃఖములకెల్ల నేను గారణభూతను. హృదయమున హాలాహాలముదాఁచి దావాగ్ని నభివర్ధిల్లఁజేసియు వెలికిరానీయక కుళ్లికుళ్లికమలికమలి తపియించి తపియించి యిట్లైతి. ఇంకేలదాఁపవలయు? కుమారులారా! మీయితరజ్ఞాతులకుఁబోలె నాకర్ణునకుఁ దిలోదకములనిండు. (ఏడ్చును.)

ధర్మ—ఏమీ? ఏమీ? అమ్మా! ఇదెట్టిమాటలాడితివి?

భీమ—అమ్మా! ఇట్టిభ్రాంతి నీకుఁ దగునా?

అర్జు—తల్లీ! నీమాట యభేద్యార్థముగ నున్నదికదా? ఆయంత్యజాతునికి మేమెవ్వరము తిలోదకములివ్వ?

కుంతి—కట్టా! వాడంత్యజన్ముఁడుగాఁ డగ్రజన్మవిభాసితుఁడు.

అర్జు—అగ్రజన్ముఁడైన మేమేల వానికుదకము లీవలయు?

కుంతి—ఆ కర్ణుడు సూతపుత్రుఁడుగాడు సూర్యపుత్రుఁడు. రాధేయుఁడుగాఁడు కౌంతేయుఁడు. నాకుఁ జిన్ననాఁడు భాస్కరు నను గ్రహంబునఁ గలిగియుండినాఁడు.

అందఱు—హా! శ్రీహరీ! కర్ణా! (అందఱు మూర్ఛిల్లుదురు.)

ధర్మ—(లేచి) అయ్యో! తల్లీ! ఈ నిప్పు నీచెఱఁగున నెట్లుమూటగట్టియుంటివే? అక్కటా! ఆ కర్ణుఁడు మాయన్నయని యించుక తెలిసియుండెనా మేమీరాజ్యమేల యాశింపుచుంటిమి? ఈబంధునాశనమునకేల యాశొనుచుంటిమి? కౌంతేయులకు మాకు రాజ్యముండవలయుననికదా పోరితిమి? కౌంతేయుఁడొక్కఁడు సర్వసంపదల నను

భవించుచుండిన మేమూఱడకుంటిమే? అమ్మా! నీవెంతఘాతుకివే? ఎంతకార్యముఁ జేసితివే? ఎంతసాహస మొనరించితివే? (స్త్రీలనోటనింతనుండి యింకమాట నిలువకుండఁబోవుఁగాక.)

అర్జు—అయ్యో! నిర్భరము. ఈభీమాదుల మమ్మెల్ల నని నోర్చి పెట్టనికోట బలెదుర్యోధనుసఖుఁడై పేర్చిన యావీరవరుఁడు కౌంతేయుఁడుకాకుండునా? కౌంతేయుఁడు గాకున్న నింతకీర్తియు నింతదానశౌండత్వముంగాంచునా? అయ్యో! నేభ్రాతృఘాతుకుఁడనైతిని. పుత్రఘాతుకీ! నీకు మేమేల జనించితిమి?

కుంతి—పుత్రులారా! మించినపనికివగచి యేమిప్రయోజనము? కాలకర్మములన్నియు వానికిఁ బ్రతికూలములైనందున జననమాదిగ మరణమువఱకు నిట్టిభంగి వానికిఁగలిగె. వానికై నేఁబరితపింపవలసివచ్చె. ఇప్పుడేమనుకొని యేమిప్రయోజనము? ఇదెవాని మాఱుగ వానితనూజు నీవృషకేతు—(వెనుకనున్న వృషకేతుముందరికిందెచ్చి) ఈ వృషకేతుఁ బాలింపుఁడు.

వృషకేతు—జనకులారా! మీరేల వగచెదరు?

అర్జు—కుమారా! పగసాధించి నీతండ్రినిఁ జంపిన దురాత్ములమనియు భ్రాతృఘాతుకులమనియు మమ్ముఁదెగడనాడక క్షమించెదవా?

వృష—తండ్రియేమి! సుతుఁడేమి! తమ్ముఁడేమి! అన్నయేమి! ఉత్తమక్షత్రధర్మవిరాజితమగు సంగ్రామమున మీరెట్లునిందార్హులు?

అర్జు—వీరశేఖరుఁడని జగములఁబ్రసిద్ధిగన్న యాకర్ణునకుజనించిన నీ కాగుణ మలవడియుండుట హెచ్చా?

(ప్రవేశము: సేవకుఁడు)

సేవక—యుధిష్ఠిరరాజన్యా! శ్రీవేదవ్యాసమౌనీంద్రుఁడు నిన్న మీతోఁజెప్పినవేళ యయినందునవచ్చి భవనమునఁగాచియున్నాఁడు.

అందఱు—హా! కర్ణా! హా! కర్ణా! (మూర్ఛిల్లుదురు.) (యవనికపడును.)

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ప్రథమాంకము-తృతీయరంగము.

### అర్జునుని యిల్లు.

[ప్రవేశము: అర్జునుఁడు.]

అర్జు—అక్కటా! ఈవేదనమున కేనెట్లు తాళుదును? మాతల్లియే తన తనయునిపాలిటి మృత్యుదేవతయాయెఁగా? ఆకర్ణునకుఁ గుంతీదేవిపోలిక యించుక యలవడియుండు టప్పుడప్పుడు తోఁచుచువచ్చె. ఎంతవైరముండినను, నొక్కొకసారి యామహాత్ముని యెడ యుద్ధరంగమునసైతము నాకు నిందుప్రేమయు నధికభక్తియుఁ గలుగుచుండు. దానికిఁ గారణమరయఁజాలక యూరక పరితపించుచువచ్చితి. అయ్యో! ఆకర్ణుఁడు మాయన్నయగుట వ్యాసమునీంద్రుఁడును భీష్ముఁడును గృష్ణుఁడును నెఱింగియుండిరఁట. వీరిలోనొక్కరైన మాయెడ నక్కటికముగలవారు కారైరే! ఒక్కరైన నాకుఁ జెప్పరైరే! ఆ కర్ణుఁడును నీ రహస్యము నెఱుఁగునఁట. ఎఱిఁగియు వీరశేఖరుఁడై దానిఁదలంపఁడాయెనఁట. అక్కటా! ఎంతటి ధీరోదారుఁడు! అయ్యయో! అట్టి మహోదారుని రణరంగమున బలివెట్టువఱకు నేనిద్రింపనని క్రూరవైరము సాధించితినే? అప్పుడుగాదిప్పుడు చంపుదునని యుత్సహించితినే? నానావిధహీనాలాపములను గష్టదుష్టకృత్యములను మమ్ము బాధించి యవమానించి రాజ్యముఁ దొలఁగించి యరణ్యములకంచి వెతలఁబెట్టించినదుర్యోధనుపైనను, నాకులభూషణు నామోహంపుఁ దనయు నభిమన్యుఁ జంపఁ గారణభూతుఁడగు సైంధవుపైనను, నేకవస్త్రను రజస్వలను నామోహంపుటిల్లాలిని సభకీడ్చి తెచ్చి కట్టినపుట్టమొలిచిన క్రూరాత్ముఁడగు దుశ్శాసనుపైనను లేనిపగ, నాయగ్రజాతుపై, లోకవిఖ్యాతుపై, నలఘుబలోదీర్ణుపై, నుదారగుణపరిపూర్ణుపైఁ గర్ణుపై సాధించితినే? అక్కటకటా! ఆ మహామహునిపాదసేవాతత్పరములై యుండఁగల యీచేతుల- నీపాపపుఁజేతుల—నా మహానుభావుని కంఠచ్ఛేదన మొనరించు పాడు బాణము నెట్లు ధరించితి? పూజ్యుఁడా! అన్నా! యని యా యతిలోకవీరునిఁ బిలుచునోటఁ, గ్రూరకర్మా! చండాలా! యనియెట్లు పిలువ నోర్చితి? ఆయశోవిశాలుని చరణముల నొత్తుకొనఁగల నాకన్నుల రూక్షభంగి నాతని నెట్లుచూచితి? అయ్యో! నిర్దయాస్వాంతుఁడనై యాపూతచరిత్రుఁ బరిమార్చితి.

అక్కటా! నే నేఁడఁబరిమార్చితి? ధనువున బాణ మెక్కు వెట్టినమాత్రమున ముజ్జగముల వారిఁ గలగుండు పెట్టఁజాలు నాయతిరథశ్రేష్ఠుని నొక్కరుఁ డని నెదిరింపఁజాలు వాఁడా? కూలుపఁజాలువాఁడా? ఇంద్రవంచనమునఁ గవచకుండలములు గోలుపోయి జామదగ్నిశాపమున దివ్యబాణములపై మదిదప్పి బ్రాహ్మణశాపమున రథముభూమి దిగఁబడి విరథుఁడై తనకుఁదానె చచ్చెఁగాక, నేనతని నిర్జించువాఁడనా? ఎదుట నిలుచువాఁడనా? అయ్యో! ఆ కర్ణుఁడు మాయన్న యని యించుకంత తెలిసియుండెనా యాదుర్యోధనునకు మేమందఱముదాసులమైయాయన్న పాదములఁ గొల్చుచుంటిమే! రాజ్యమాశించి యుండమే! బంధుద్వేషమును గురుబాంధవ మిత్రవధయును గాక యుండునే! పాపులకు మాకట్టి ప్రాప్తియెట్లులభించు? ఇందు దురితమును దుఃఖమును నందునరకమును లభింపనుండ నక్లేలగు? కృష్ణా! నీకు నింతటి ద్రోహబుద్ధి కలిగెనా? మఱఁదియని సఖుఁడని నన్నాదరించుచు సారథివై దైవమవై ననుఁబోషించుచుంటివే! ఈమాట నాకుఁజెప్పకుండుటకు నేనేమి ద్రోహముఁజేసితిని? ఇంతనాతోడనైనం జెప్పకపగవట్టి నిర్జింపఁజేసితివే? ఎవరిని? నీమఱియొక్క మఱఁది నేగదా? నీ మేనయత్త పెద్దకొడుకునఁగదా? అతఁడు నీకేమివిషముపోసెను? అయ్యో! నేనూరక యా మహాత్ముని నేల తెగడనాడెదను? నాప్రాప్తి యిట్లుండ నెవ్వరు తప్పింపఁజాలువారు?

అయ్యో! ద్రౌపదికైకదా యే మింతపగఁబూనితిమి! ఆద్రౌపది లేకున్న నింకొక ద్రౌపది కలిగియుండును. రాజ్యము కావలెననికదా యింత సాహసమొనరించితిమి! ఆరాజ్యముకాకున్న నింకొకరాజ్యము కలిగియుండును. ఇప్పుడట్టియన్న మాకెట్లుకలుగును! అయ్యో! ఆ యన్న మాకు లేఁడయ్యెనే! ఇంకమాకుఁగలుగఁడుగా! హా! కుంతీ! నీ వెంతటిదుష్కృత్యమునఁ గోర్చితివి? ఎంతకార్యముఁజేసితివి? అయ్యయో! ఈపాపము నేనింకెట్లు పాపికొందు? ఎందుఁ జొత్తును? ఏది తెఱవు? అశ్వమేధమఖముఁ జేసిన నిట్టిపాపములు నివర్తించునని వ్యాసమునీంద్రులు బోధించి మాయన్నచే భీష్ముని వలన ధర్మములు విన్నపిదప నుత్తరాయణమున నామఖోద్యోగముఁదలపెట్టించియున్నారు. అయ్యో! మాయన్న యనుచున్నాను. కర్ణుఁడుమాయన్న. ధర్మాత్మజునన్నయని పిలుచునప్పుడంతయు నాకుఁగర్ణుఁడు జ్ఞాపకమునకు వచ్చునే! దాని నేనెట్లుమఱతును? అయ్యో! శతసహస్రాశ్వమేధ మొనరించినను నెన్నిపాపములు పోయినను నా మహేంద్రపదవియే యిచ్చినను మాయన్న మాకుఁగలుగఁడే!

హా! కర్ణా! కర్ణా! అగ్రజా! యుధిష్ఠిరపూర్వా! నీరూపము నాకుఁజూపరాదా? ఒండేనియిప్పుడే యవతరించి యీక్రూరకర్ముని నీపితృఘాతుకుని సంహరింపరాదా? అయ్యో! ఇంక నే నీ భూమినుండను. ఉండను. నాకుయజ్ఞమువలదు. యాగమువలదు. ఊరునువలదు. అరణ్యమునువలదు. అమ్మయువలదు. అన్నయువలదు. ఇప్పుడే యా కర్ణువధించిన చోటికేగి చితి యమర్చుకొని దగ్ధుఁడనయ్యెద. లేదేని చరుపాతమొనర్చెద. విషముమ్రింగెద. శూలమునఁగుమ్మకొని ప్రాణములఁబాసెద. ఎట్టిదుర్మరణమునకైన నియ్యకొందును. ఈవేదనమున కోర్వఁజాల. అయ్యో! ఇచ్ఛామరణము సామర్థ్యముగల వారెట్టిపుణ్యాత్ములు? అట్టిపుణ్యము నాకు లేకున్నదే! హా! కర్ణా! కర్ణా! (మూర్ఛ).

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ప్రథమాఙ్కము-తురీయరంగము.

### వీధి.

[ప్రవేశము: శతరూపుఁడు, మృత్యుంజయుఁడు.]

శత—మృత్యుంజయా! ఈ యజ్ఞమునసైనను మనకు దక్షిణబహుళముగాఁ గలుగునని నిశ్చయమా?

మృత్యుం—అందుకు సందేహములేదు. కావలసినంత చిక్కును.

శత—ఈకొన్ని మాసములలో నాడులేని ధనమెక్కడ నుండి వచ్చెను?

మృత్యు—శతరూపా! మరుత్తనురాజు పూర్వము యజ్ఞముచేసినకాలమున బ్రాహ్మణుల కలవికాని ధనము దానముచేసి యుండె వారి కాధనమత్యధికమైన కారణమున, దానియందుఁ గావలసినభాగము వారుతీసికొని మిగిలినదాని నొక్కయెడఁజేర్చి పెట్టి యేకవాక్యతతో నీధనమెవ్వరికిఁజిక్కిన వారిదేయగుఁ గాకయని చెప్పియుండిరని వ్యాసులు ధర్మరాజుతోఁ జెప్పి దానిఁజూపించి తీసికొనునట్లు చేసియున్నాఁడని మనము వినలేదా?

శత—అయ్యో! ఈయశ్వమేధమునకుఁజిక్కిన ద్రవ్యమునాఁడే జ్ఞాతిమేధమునకుఁజిక్కియుండరాదా? అట్లయిన మనకు రెట్టింపగుచుండెనే?

[ప్రవేశము: ద్రావిడబ్రాహ్మణుఁడు.]

ఇతఁడెవ్వఁడో బ్రాహ్మణుఁడు వచ్చుచున్నాఁడు. ద్రావిడప్రాణాయామము గారూ! నమస్కారము.

ద్రావిడ—ఏమిచేయుచున్నారయ్యా యిక్కడ? అయ్యో! ఆకలిచే సగమయితిని.

శత—సగమైయిట్లున్నావా? ఇంకఁ బూర్ణముగానుండిన నెట్లుంటివో?

మత్యుం—అయ్యో! బ్రాహ్మణా! ఈరాజ్యమున నిది యేమాకలియనుచున్నావు? ఇప్పుడు జరుగుచున్న సందర్భమేమి? నీవాడుకేమి?

ద్రావి——ఏమిసంరంభము? ఏమిసంరంభము?

శత——బ్రాహ్మణా ! ఏమియజ్ఞము జరుగుచున్నది ! ఎంతదక్షిణలిచ్చుచున్నారు ! దక్షిణ వాసనగుఱుతింపనేరని బ్రాహ్మణుఁడ వెక్కడిబ్రాహ్మణుఁడవు?

మృత్యుం——దక్షిణవాసన యేమితెలియును ? పులిహోరవాసనయైనఁ బట్టఁగలఁడేమో.

ద్రావిడ——నన్నేలహాస్యముచేసెదరు? సంగతియేమి?

(లోపల భేరీధ్వానము.)

మృత్యుం——అదిగో భేరిమ్రోయుచున్నది వినుము. ధర్మజుఁ డశ్వమేధ కంకణబద్ధుఁడై యున్నాఁడు. ఇప్పుడు హయపూజ జరుగుచున్నది. పోదమురండు.

(నిష్క్ర.)



# ప్రమీలార్జునీయము.



## ప్రథమాఙ్కము-పంచమరంగము.

### యజ్ఞవాటము.



[ప్రవేశము-ధర్మజ భీమార్జున నకుల సహదేవులు-(హయముఁ బూజించుచు) వ్యాసుఁడు-బ్రాహ్మణులు.]



వ్యాసుఁడు—(హయపూజనిలిపి) యుధిష్ఠిరా! ఈ హయము ఫాలపట్టిక సిద్ధమయి యున్నదా?

ధర్మ—అర్జునా! అది యెందున్నది?

అర్జు—అదిగో సిద్ధమైనది.

వ్యాస—అందేమి వ్రాయఁబడి యున్నది?

అర్జు—(చదువును.)

శా॥ శాంతిశ్రీనిధివాజిమేధ హయము తాస్వాహంబున స్వీరసూ।
కుంతీ సంభవుఁడంపె, వెంట నిటలాక్షుం గెల్చి శ్రీమించు దు।
ర్దాంతుండర్జునుఁ డేగు దెంచె వడిశౌర ప్రక్రము ల్దీర తా।
స్వాంతుల్ధారుణినుందు రేనిముద మొప్పన్వాహముం బట్టుఁడీ॥

వ్యాస—మిక్కిలి చక్కఁగానున్నది. అర్జునుఁడంగరక్షగాఁ బోవుట మిక్కిలి మేలు. అర్జునునకు సహాయు లెవరు?

అర్జు—ప్రద్యుమ్నుఁడు-మేఘనాదుఁడు-వృషకేతుఁడు-సాంబుఁడు-సారణుఁడు సహాయులుగా రా నుద్దేశింపఁబడినది.

వ్యాస—మిక్కిలి మేలు. ఇంక హోమమునకుఁ బ్రారంభము చేయుదుము.

(నిష్క్ర.)



శ్రీ

# ప్రమీలార్జునీయము.



ద్వితీయాంకము - ప్రథమరంగము.

**శ్రీ మండలరాణియగు ప్రమీలాపురి సుందరి తోఁట.**

ప్రవేశము - కాదంబిని, చారుమతి, కనకలత, మంజువాణి, మాలతి, మలయవతి, మంజరి.




అందఱు— (అనుబంధము 2.)

మాలతి—చెలులారా! చూచితిరా! యీ వనమెంత రమణీయముగా నున్నది!

మంజరి—ఈ చీఁకటి మ్రాఁకులఁ గంటివే? దీనినీడనున్న జగమే చీఁకటిగాఁ దోఁచును.

కనక—ఆహా! ఈ సరోవరమెంత మనోహరముగానున్నది చూఁడుఁడు!

కాదంబి—ఈ సరసినున్న కమలములఁ గంటిరే? ఎట్టివికాసభావము గాంచియున్నవి!

మలయ—ఉన్నవికాని నీవుమాత్రము వీనిఁగన్నెత్తి చూచిన నవి ముకుళభావముఁ జెందఁ గలవు.

మంజు—మలయవతీ! ఇశ్శీలంటివి? మనకాదంబిని కన్నులంత దృష్టి దోషము గలవియా?

మలయ—దానికన్నులకు దృష్టిదోషములేదుగాని నీకుమాత్రము బుద్ధిదోషము.

మంజు—అదేమి, యిట్లాడెదవు? నాకు బుద్ధిదోషమా లేక నీకు వాక్యదోషమా?

కనక—ఇశ్శీల్ల మాటలాడెదవే? మంజువాణీ! మన కాదంబిని వీక్షించిన నిందలి కమలములు ముకుళిన భావముఁ జెందునని మలయవతియన్న మాటకు భావమరయ లేవైతివా?

మంజు—మలయవతీ! నను క్షమింపుము. ఇపుడర్థము తెలిసె.

మలయ—తెలిసెనా? మంచి మేధావినివి.

మంజరి—అది యుండనీ. ఈగండు మీలఁ గంటివే? ఎట్లులికి యులికి యెగిరి యెగిరి పడుచున్నవి!

మలయ—ఈ కమలములు క్రిందఁ బడునో మేము క్రిందఁబడుదుమో యని పేరాసఁ బోరాడు చున్నవి.

మంజువా—నీమాట లించుకైన నాకుఁ దెలియవు. కమలములకు మీలకు నేమిస్పర్ధ ?

మలయ—కొంచెము కన్నులు తెఱచి చూడుము, తెలియును.

చారు—చెలియలారా! చల్లగనున్నది. ఇందింత కూరుచుందము.

(అనుబంధము 3.)

సఖీమణులారా! ఇపుడే మన మంబు ఖేలన మొనర్తమా ?

మలయ—మీకుఁ బ్రొద్దుపోవదో ? ఆ పూఁబొదరిండ్ల నింత క్రీడించి పిదప స్నానము సేయుదము. పోదము.

(పక్కకుఁబోవ.)

ప్రవేశము-హయముతో హయపాలకులు.

---

(అనుబంధము 4.)

స్త్రీలు— (అనుబంధము 5.)

కనక—మిత్రులారా! ఇది యజ్ఞాశ్వమైన మంచి సొగసాయె. మనము దీనింబట్టి మన ప్రమీలా రాణికిఁ గానుకగా నిత్తము.

అందఱు—(అశ్వమును బట్టుదురు.)

మేఘ—(స్వ) ఔరా! ఈ స్త్రీలెంత సుందరులుగానున్నారు ? వీరితో మాటలాడ వలెనన్న బెగడు కలుగుచున్నది. అయినను దగినభంగి నుద్బోధించెదను. (ప్ర) నారీమతల్లులారా! మీరేడ యీ యజ్ఞాశ్వమేడ ? పట్టినంతనె యూరక పోదు సుఁడీ.

కనక—పట్టినపిదపఁ బోవ నెట్లు పోవును ? సఖులారా! దీని లలాటముననేమో పట్టిక యున్నది. దానిఁ గైకొని చదువుదము.

మలయ—(పద్యము చదువును.)

కనక—ఔరా ? "వీరసూకుంతీ" యఁట. లోకమునఁ గుంతియొక్కరితయే వీరమాత యని యీ ధర్మజుఁ డెంచెఁగాబోలు! చూతము.

మేఘ—వనితామణులారా! ఇదేమి పిన్నాటలని యెంచితిరా ? యజ్ఞముచేయనున్న ధర్మజుఁడును వెంటవచ్చియున్న యర్జునుఁడును నెవరని యెంచితిరి ?

కనక—ఓహో! "ధర్మజుఁడెవ్వరా" ? తనయాలిని పగతురుపట్టి సభలోఁ బుట్టము లొలువఁ జూడఁజాలక తలవంచుకొనియుండి యదేపట్టుగా నెత్తిపై బట్టవేసికొని పంద్రెండేం డ్లరణ్యమునఁ బడియుండిన ధర్మజు నీవయెఱుఁగుదువో ?

మలయ—అర్జునుని మేమెఱుఁగుదుము.

కాదంబి—మలయవతీ! ఎవ్వఁడే యాయర్జునుఁడు ?

మలయ—ఉండలేదేమే, యదియుఁగాకయిదియుఁగాక విరాటపురిలో గాజులఁ గంచుక ఘుంబొడిగించుకొని యాడువాండ్రకు విద్యచెప్పుచుండిన పేడి? అతఁడేకదే మయ్యా మీయర్జునుఁడు?

మేఘ—సతులారా! మీరు సతులవుట నే మన్నను జెల్లెఁగాక, యొండైన—

మలయ—ఏమిచేయుచుంటివి?

కనక—మలయవతీ! అది యడుగవలెనా? సతులవుటచే నింత ధైర్యముగ నిలిచి నాఁడు. కాకున్న—

మేఘ—ఇంకూరకుండుఁడు. మీకు బుద్ధి చెప్పెద.

మలయ—నీ కాలికిఁ జెప్పుకొనుము.

హయ— (అనుబంధము 6.)

మేఘ—భటులారా! యీకలహము మనకువలదు. ఈయబలలతో యుద్ధమాడితిమని చెప్పుకొన్న సిగ్గుకాదా? తొలుత మనమాయర్జునునితో నీవృత్తాంతము వివరించి యతఁడు బోధించిన భంగి జరుపుదము. వనితలారా! అయిన మీరీ యశ్వమును విడువరు?

కనక—మాయిష్టము.

మేఘ—మీకిట్టిసరసము తగదనియు మీకీహయముఁబట్టఁదగదనియుఁ జెప్పుచున్నాను.

కనక—కావున నవశ్యముపట్టెదము.

మేఘ—అయినఁబట్టుకొనిపొండు.

మలయ—మేము పట్టుకొనిపోవము,

మేఘ—(స్వ) వీరురాక్షసులుగా నున్నారు.

మలయ—నీవు రాక్షసుని కొడుకవుగావా?

మేఘ—మీతో నేటి సంభాషణము?

మలయ—వలదు. (హయపాలకుల నిష్క్రమము.)

చారు—సఖులారా! ఇది కడుదుడుకుఁదనము. మీకుఁ దెలివిచాలదు. ఊరకీహయమును విడిచి మనదారిఁబోవుదము.

కనక—చారుమతీ! నీకేమితెగులు కలిగెను? ఇట్టిచేఁతఁగాని మగమాటలాడెదవు?

చారు—కనకలతా! నీకు వివేకముచాలదు. కాలుదువ్వి మనమీకలహమునకేల పోవలయు?

మలయ—చారుమతీ! నీగుణమే యిట్లా? లేక, యారాక్షసునిఁ జూచి యేమైన మోహించితివా?

అందఱు—(నవ్వుదురు.)

మలయ—కాదంబినీ! మనమెల్లర మీచారుమతిని నీ యశ్వముపై నెక్కించుకొని పోవుదమా వావ్యాళి?

చారు—ఇంకఁజాలు మీసరసములు. (నిష్క్ర.)

అందఱు—(నవ్వి నిష్క్రమింతురు.)

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ద్వితీయాంకము-ద్వితీయరంగము.

### వీధి.

[ప్రవేశము: సుయోగుఁడను రాయబారి.]

సుయో—ఆహా! ఏమియీయాశ్చర్యము! ఈరాష్ట్రమున మగరూపుగల పురుగైనఁగానరాదు. స్త్రీలన్ననో యొక్కరిఁజూచినకంట మఱొక్కరిఁ జూడఁగూడకుండ నున్నారు. ఆవిలాసములేమి! ఆకులుకులేమి! ఆబెళుకులేమి! వర్ణింపశక్యముగాదు.

(అనుబంధము. 7)

మగవాఁడన్న నించుకైన భేదములేక చూచెదరు. చూచితిరా! మొట్టమొదటిది నవ్వు, రెండవదికనుసైగ, మూఁడువది యొయారము, నాలవదియేమో. వీరియెదుట మగవాఁడే సతిఁబోలె సిగ్గరియైనటింపవలయుఁగాక వీరికించుకైన సిగ్గుగదురదు. ఇట్టి విపరీతములుండునా! నే నీ వీధినివచ్చుచుండ నొక్కవనితయింటివెలితిన్నెపైఁగూర్చుండియుండఁజూచి యచ్చెరువందితి. సర్వాభరణభూషితయై పుడమికి దిగిన యప్సరోయువతి వోలెనలరారె. కొంచెము నిలిచిచూతుఁగదా. దానియజమానురాలి యాజ్ఞచే నది కసవూడ్చుటఁగాంచి కసవుబానిసయని యెఱిఁగితి. మాయురే! ఏమివైభవ మీపురివారిది! ప్రమీలా రాణియొద్దకు రాయబారమునకై పార్థుఁడు నన్నంపియున్నాఁడు. ఆరాణి యెట్లున్నదో! అదెంత సుందరముగానున్నదో! నాపుణ్యమేపుణ్యము. ఇట్టిధరాప్సరసల దాసీజనములుగా నొనర్పఁగలిగిన యీపురివారికెల్ల నేలికయగు నాజగన్మోహినిఁ జూచుపుణ్యమెన్నఁ డెట్టివారికి లభింపఁగలదు? అదియంతయునుండనీ. న న్నాయర్జునుఁడు పంపినపని నేనొర్పఁగలనా! ఊరుచూచినంతనే భ్రాంతిగలిగె. ఊరి కాంతామణులఁజూచినంతనే తిచ్చపాటుగలిగె. వారి నవ్వులఁజూచినంతనే మతి విభ్రమముగలిగె. ఏమేమోతోఁచుచున్నది. ఇట్టివాఁడ నేనీసందేశకృత్యము నెఱవేర్పఁగలనా? ఇదిగో! ఎవ్వతెయో యొక నారినాయెడకే వచ్చుచున్నట్లున్నది. ఇది సమీపమునకువచ్చి ననుమాటలాడించెనా దానిదాసుఁడనై దాని వెంటనే పోయెదఁగాక, నాకార్యము ముగింపఁజాలను. కావునఁ బరుగెత్తిపోయెదను.

నిష్క్ర.

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## ద్వితీయాంకము-తృతీయరంగము.

ప్రమీలయొక్క సభ.

ప్రవేశము: ప్రమీల (సింహాసనమున) కాదంబిని, కనకలత, చారుమతి, మలయవతి, మాలతి, మంజుభాషిణి.




అందఱు— (అనుబంధము 8.)

ప్రమీల—సంగతులన్నియుఁ దెలిసెఁగదా ? తెలిసియో తెలియకయో మనవారశ్వబంధన మొనర్చిరి. ఇప్పుడొనరింపవలసిన కార్యమునకై మనమాలోచింపవలసియున్నది. మీరెల్లరు ధీమతులు. ఈవిషయమున యుక్తాయుక్తములు తారతమ్యములు పరిశీలించి మీమీ యభిప్రాయముల నెఱింగింపవలయు. కాదంబినీ ! నీ యభిప్రాయ మేమి ?

కాదం—మహారాణీ! నాయభిప్రాయ మేమని యడుగవలెనా ? సర్వవిషయములు కరతలామలకముభంగి నెఱింగి యెట్టి దురూహవిషయములనయినను మంత్రాలోచన మొనరించి కార్యసాధకముఁబడయఁగల నీకుఁ దెలియనివిషయ మేమున్నది? అయినను మా యభిప్రాయము నడుగుట మాపై నీకుఁగల ప్రేమను దెలియఁజేయుఁగావున మహాభాగ్యమని విన్నవించుచున్నాను. ఇప్పుడు మనమింత యాలోచన చేయవలసినకార్య మే నాకుఁదోఁచదు. మందబుద్ధులగుపురుషులు మనల నబలాజనమని యెదరు. మనబుద్ధి ప్రళయాంతకమనియుఁ గల్పించుకొనియున్నారు. అవి యెల్లఁగల్లఁజేయను నేడు తఱి యొదవినది. అబలాజనమవుట పురుషుల ననవలయునో లేక తరుణుల ననవలయునో లోకము వారందఱు నేడే యెఱిఁగెదరుగాక. ధర్మజుఁడు వీరసూకుంతీసంభవుఁడఁట. అర్జునుఁడు నిటలాక్షునిఁగెల్చిన శూరుఁడఁట. వీరిసామర్థ్యములు పరీక్షించుటకుఁ దఱియొదవినది. ఆకుంతి యెంతచల్లనీ కడుపుగలదియో నేడేపరీక్షించెదము. మరి యెవ్వరెట్లాడినను నాకు మాత్రము సెలవిచ్చిన నేనొకరి సహాయ మపే

క్షింపక యాపార్థు ననికినినంతయు నణుమాడి వానినేలకుఁదెచ్చి నీకు దాసునిఁగాఁ జేసెద. నాయట్టి సుభటశ్రేష్ఠులు వేనవేలు నీకలవడియుండ యోచింపనేలవలయు? యుద్ధమే కర్తవ్యము. ఇదియే నాయభిప్రాయము.

ప్రమీల—కాదంబినీ! నీమాట లుత్సాహ జనకములై, యభిప్రాయము ధీరమై యొప్పారెడు. కనకలతా! నీతాత్పర్యమేమి?

కనక—దేవీ! విజ్ఞాపనము. దిగంతములనెల్ల నీధురీణత వలని కీర్తి నిండియుండ నారుద్రుఁడైన నీయెదుటనిలిచి పోరాడఁగలఁడా? తరుణులకెట్టి స్వాతంత్ర్యము నివ్వఁ జనదు, వారికెట్టి విద్యలను నేర్పఁ జనదు, వారినెప్పుడు నేలఁబెట్టి కాలరాచవలయును, వారెట్టిశక్తి కలిగియుండినను బురుషులకంటె మిక్కిలి హీనసత్వులను నట్టి యభిప్రాయములుగల మగపందులకు సిగ్గొదవునట్లు సమధికశక్తి సముపేతవై జగత్రయ విఖ్యాతవై రాజ్యమేలుచున్న నారాయణివికావా నీవు? అట్టి నీవు మమ్మెల్ల నభిప్రాయములేల యడుగవలయు? అయినను నడిగినప్రశ్నకు నుత్తర మివ్వకుండుట సేవక ధర్మమునకు విరుద్ధము కావున వచించెదను. నీదాసి నేనొక్కతెయే చాలుదు నా యర్జును నోటుపఱుప. ఈ కాదంబినియు నట్టిదయగు. మాకంటె బలిష్ఠు లగువా రసంఖ్యేయభటవరిష్ఠులు నీకుఁగలరు. అట్లుండ నాపార్థునికై యేల చింతింపవలయు? తురంగమును బట్టితిమి. దురమునకుఁ దొడదట్టితిమి. ఇంక వెనుకదీయఁ బోలునా? పార్థుఁడుకా దానారాయణుఁడు వచ్చినను భీతిల్లువారెవరు? ఆ పార్థుఁడు మాపై ననికివెడల వలయునన్న వానిసతి మంగళసూత్రము మిక్కిలి గట్టిగ నుండవలయుఁగదా? మహారాష్ట్ర సింధుమాళవాది దేశములనేలు దొరలందఱు మనతో నెన్నిమాఱులు సంగ్రామము చేయరైరి? వారలొకప్పుడైనఁ దలయెత్తుకొని వెనుకకుఁ బోవఁజాలిరే? ఈ నరుఁడు గిరుఁడు వారికంటె నెందున నెక్కుఁడగు వాఁడు?

మ॥ జ్వాలనాకుంఠిత లోకభీకరవిరాజద్భూరిదావానలుల్ ।
శలభాళుల్నిజపక్షమారుతములన్ జల్లార్పనేతెంచు భం ।
గి లసద్విక్రమరేఖమించిన మము న్గెల్వంగ, నీయర్జునా ।
దులు పైవచ్చిరి, తామెకాల్వఁబడరో, దుర్వారయుద్ధంబునన్॥

కావున నే నీకాదంబినీ యభిప్రాయమున నేకీభవించెద.

ప్రమీల—కనకలతా! నీ యుక్తులు శూరధర్మదాయకములు, మిక్కిలియొప్పును. చారుమతీ! నీయభిప్రాయ మేమి?

చారు—మహారాణీ! ధీరలభంగి వీరువాక్రుచ్చిన విషయములు మిక్కిలి యొప్పునని యెందున్న యిందఱు శిరఃకంపమొనర్చి ప్రశంసించుచుండఁగా నాయభిప్రాయము చెప్పుటకు నాకే కొంకు కలుగుచున్నది. అయినను మనఃపూర్వకముగ నొక్క

రొక్కరి యాశయము నాసతో వినఁగోరి దేవి ప్రశ్న మొనర్చినందున మనోగతాభిప్రాయమును నిశ్శంకముగా నొక్కరిట్లందురని భీతిల్లక చెప్పుటయే ధర్మమగు. కావున కొంకుమాని వచించెద. నే నీవిషయమున నింతకు మును పే దీర్ఘాలోచన మొనరించి యున్నాను. నాకుఁజూడ నీ యుద్ధము సమంజస మని తోఁచుచున్నది. తత్కాలమునఁ బ్రభవించిన ధీరగుణోత్సాహమున వలసినంత మాటలాడ వచ్చుఁగాక, తారతమ్యముల గుఱుతించి యుక్తాయుక్తములఁ బరిశీలించి జయాపజయముల నూహించి వచింపవలెనన్న నించుక యోచనవలయు. ఆయోచనమాని యూరక నోటికి వచ్చినట్టు మాటలాడుట మొఱకుఁదనమగు. తొలుతఁదారతమ్యముల యోచింతము. యజ్ఞమొనర్చువాఁడు దేశదేశరాజ కోటీర మణివిభోద్దీపిత చరణయుగళుండగు ధర్మాత్మజుండు. అతని ప్రాభవము మనము వినమా? ఆ దుర్యోధనుఁడు సూదిమొన యంతేని రాజ్యభాగ మాతనికియ్యనని యేకాదశాక్షౌహిణీసేనాసమేతుఁడై యాతనితో సమరమున కుద్యమించె. పదునెనిమిది దినములలో వాఁడును వానిసేనయు వానిబంధువులు మిత్రులు నెందుఁగానఁబడిరి? మనమెఱుఁగమా? అట్టివానితో మనము కారణములేని వైరము పూనుట లగ్గగునా? అదియుండనీ. వచ్చిన వానినింత విచారింతము. వాఁడన్ననో రుద్రుతో నెక్కటి పోరుననారితేఱి పాశుపత లాభముఁబొందినాఁడు. అమరేంద్రుఁ నర్ధాసనమున కర్హుఁ డనిపించుకొని కాలకేయనివాతకవచుల నొక్కరుఁడ పరిమార్చి దివ్యకిరీటమును దివ్యశంఖమునుఁబడసినాఁడు. ఒకయుత్తరుఁడు తనకు సారథిగాఁ గౌరవబలము నంతయు నొక్కనాడ నేలకుఁ దెచ్చినాఁడు. మనుజులకె కా దాయనిమిషులకైనఁ బోర జయింపఁజాలనివాఁడు. అట్టివానితోడ మనము సంగ్రామమొనరింపమనకు జయముసిద్ధించునా? కావునఁదారతమ్యభంగియిట్టిది. యుక్తాయుక్తములనెన్ని చూడనిప్పుడు మనము పట్టినహయము నట్టెవిడిచి దానితోడఁ గూడఁ గానుకలుసమర్పించి యాయర్జునుతో సంధియొనర్చుట పరమభావ్యము. ఇదియే నా యభిప్రాయము.

కం॥ నయరీతి నర్జునున కా।
హయరాజము కానుకలును నర్పించుచు సం।
ధి యొనర్చుటయే తగు ని।
ర్భయముగ ననిసేయుటది యపాయము దేవీ॥

ప్రమీల—చారుమతీ! నీ యభిప్రాయము నిరపాయము. మిగిలినవారేమి చెప్పెదరో విచారించిచూచెద. మలయవతీ! నీయభిప్రాయమేమి?

మలయ—దేవీ! నాకుఁజూడ నీచారుమతి మాటలజాడ యుక్తమనిదోఁపదు. ఇవి రణభీరువుల వచనములు. ధర్మజుని నాయర్జునుని నీ చారుమతివందిపోలెఁ బ్రశంసించి వారికి భీతిల్లినమాటలాడె. అనికి నిలిచిన నాయర్జునుఁడుకాఁ డాభిదురపాణియేవచ్చి నిలిచినను సురాసురదురాసద ధరాధర శరాసనుఁడే యామురాంతకపరాంబకుఁడే

వచ్చినిలిచినను మనము వెనుదీయుదుమా? అంతభీరువులగుటకు మనమేమి మగవాం డ్రమా? ఏమి యీమాటలవలనఁ బ్రయోజనము? సంగ్రామభీమత్వంబునఁ బరిపంథిస్తోమ గ్రామంబుల నిర్ధూమధామంబులఁ జేయఁజాలమా? నాకొక్కతెకాజ్ఞయిడుము. ఆ యర్జునుఁడెక్కటి పోరున రుద్రుఁగోల్పడఁజేసెననఁగదా! నేనెక్కటిపోరున వీని నెట్లుచేసెదనో నీవచూచెదవుగాక. కాలకేయ నివాతకవచులనొక్కరుఁడె సమయించె నన్నఖ్యాతి యీయర్జునునకుఁ గలదు. కౌరవసేననంతయు నొక్కరుఁడెనుఱుమాడె నన్న విఖ్యాతియుఁ గలదు. ఏరుద్రుజయించినను, నేకేయు నేకవచుఁ జక్కాడినను నేసేనఁగోల్పుచ్చినను మలయవతిని జయించుట యసాధ్య మనిపించెదను.

శా॥ ఆకామారినిఁబోరఁ గెల్చినను దేవారాతులన్ గూల్చినన్ ।
ఆకౌరవ్యులనెల్లఁ జీల్చినను నాకాధీశు మెప్పించినన్ ।
ఈకాంతామణులన్ జయింపనగునే యెందేనియన్ ఖ్యాతి నేఁ।
జేకూరంగ రచించెదన్ గలనిలోఁజీకాకు గావించెదన్ ॥

నాఖ్యాతి జగముల నించెదను. ఇంకే మభిప్రాయమియ్యఁ గలను ?

ప్రమీలా——మాలతీ ! నీవేమందువు?

మాలతి——రాణీ ! ఈకాదంబినీ కనకలతామలయవతుల మాటలను నీ చారుమతిమాట యును నాకు రుచికరముగాఁ గనుపట్టదు. యుద్ధమున వాఁడెక్కువ నేనెక్కువ యని వీరమాటలాడెదరు గాక ముఖ్యాంశముల వీరుగుత్తింపరైరి. ఈయర్జునునితో నైనను మఱియెవ్వరితోనైనను మనకు యుద్ధమేల కావలయు ? సానవెట్టి చికిలిఁ దేల్చిన కుసుమశరాసనుని నారాచ సముదయమో యను భంగిరాజిల్లు మా యెదుట యుద్ధమున కని నిలిచినవారికి ధనువుపైఁ జేయిపోవునా ? బాణములపై దృష్టిగలుగునా ? యుద్ధమునకు మదిపుట్టునా ? మము వీక్షించిన మాత్రమున "దాసోహ" మ్మని కాళ్ళఁబడరా ? ఇంక యుదమేటికి సంధియేటికి ?

చ॥ ప్రకటకటాక్షమాత్రమున బల్విడిలోకములెల్ల గెల్చు బ ।
ల్చికిలియొసంగనూఱి మెఱుఁజేసిన సానమెఱుంగుపంచసా ।
యకుని శరంబులోయన నయారె వెలుంగ మెమాకు యుద్ధమే।
టికి మఱిసంధియేటికిఁ దటిత్కనదంగములన్జయింపమే ॥

ప్రమీలా—— (నవ్వి) మాలతీ ! నీయుక్తి కదుమనోహరము. నీవింతకుఁ జాలుదువు. మంజరీ నీతాత్పర్యమేమి ?

మంజరి——దేవీ! మనమా యశ్వమేధ హయమునుబట్టిన దెందుకు? వినోదమునకా? విరస మునకా? ఎట్లు పట్టినను మనమేమియు నౌనర్పకయే యీ కౌంతేయులకుఁ గార్య

వైఫల్యముగలిగించి పరిహసింపవచ్చును. ఈయర్జునుఁడుగాడు. ఆవిశ్వేశ్వరుఁడు వచ్చి నను బంగ్రొడెండేండ్లు ముట్టడివేసినను సాధింపఁగూడని కోట సంపద మనకుఁగలదు. మనమూరక యీహయము నెక్కి వీధీదిరుగాడు చుందము. అర్జునాదులందఱు వెలుపల నఱచియఱచి వారేకాల ధర్మము నొందుదురు. ధర్మజుని యశ్వమేధమును నిరంతరాయముగా ససాకల్యముగా నెఱవేఱఁగలదుగాక. మనకేమి యుద్ధమువలదు. మనము వెలికైనఁ బోవలదు.

ప్రమీల—మంజువాణీ ! యింక నీయుదంతమేమి ?

మంజు—నాయుదంతమేమున్నది? ఇందఱికంటె నే నెక్కువ చెప్పఁగలదాననా? ఈచారుమతి మాటకొంచెమైనను రుచికరముగాలేదని తోఁచుచున్నదిగాని దానియందును గొంచెము సాగనుకలదు. సంధిచేయుమనుచున్నది. సంధివలనఁ గొంచెము మేలును గొంచెముకీడును గలదు. మిగిలిన వారన్నయో యుద్ధమే ప్రశస్తమనిరి. అదియు మంచిచిదేకాని దాని యందును గీడులేకపోలేదు. సంధియును యుద్ధమును రెండు నొనర్చినమేలనినాకుఁ దోఁచుచున్నది. అయిననొక్కటి మాత్రము సంశయము. మొదట యుద్ధము కావలెనా సంధికావలెనా యనునది. యుద్ధము పిదపజరుగఁదగిన సంధి మేలు. సంధి పిదప జరుగఁదగిన యుద్ధము మేలు. అదికొన్ని విషయములమేలు. ఇది కొన్ని విషయములమేలు. మీకేది యొనర్చినమేలని తోఁచిన దాని నొనర్పుదును. ఇది యే నాయభిప్రాయము.

తే॥ గీ॥ చాలమేలును గీడునుసంధి దెచ్చు।
మేలుకీడును గలిగెడు నాలమునను।
సంధియైనను బరికింప సమరమైన।
మీకునెయ్యది యిష్టమోనాకునదియె॥

ప్రమీల—(నవ్వి) మంజువాణీ! మంచిమాటలాడితివి. ఇట్టియభిప్రాయముల నాలకొల్పి యేదేని కార్యమొనర్పఁ బ్రయత్నింపవలయు.

మంజు—అటుగాదు – మీరు దీర్ఘాలోచనచేసితిరేని నాయభిప్రాయమే సత్యమనియు క్షేమమనియుఁ దోఁపఁగలదు.

ప్రమల—సత్యమనుటకు సందేహమేమి? "కుక్క లేకునకాలు కుండలే భాండములు" గదా? దీనికి దీర్ఘాలోచనయేల? ఆయాలోచన మాకుఁ దప్పించి యుండిన మేలుగానుండెను. ఉండనిమ్ము.

మిత్రులారా! కనకలతాదులారా! మీయభిప్రాయముల నన్నిఁటిని వింటిని. ఒకరొకరును విశేషధీశాలురై యుక్తవిషయమున వేటొకరికడ మియ్యని వారైయుండుటఁజేసి ప్రతిభావిశేషమున వాదము లాడితిరి. మనమా చిరకాలమునుండి శక్తిశాలినుల

మనియు నజేయులమనియుఁ బ్రసిద్ధిఁగంటిమి. ఎందు నీడు లేని ధీరవర్తనమున **మంటిమి.** వనితాజనము లబలాజనమనియు నపగతవివేకినులనియు నింతవఱకెదురులే కాడు చున్న మగ పందలకు సిగ్గువచ్చుభంగిఁగంటిమి. రాజకార్యకరణమునను బరిపాలన విశేషమునను నరి నిబర్హణమునను గొంతతలేకయుండ నిన్ని దినములు కాలముగడిపిన మన మిప్పుడు వెనుకదిరుగుట యధీరగుణము. సంధికి మనమై పోవుట యశూర గుణము. సంధియొనర్చిన నిన్ని దినములనుండి సాధించిన మనకీర్తి విలుచుట యనుట యవిచారగుణము. కావున మనమవశ్యము యుద్ధమాడనేవలయు. ఈ మాటలనుట వలననే నీచారుమతి మతివిశేషమును నుచ్చరింపరాదన ననకుఁడు. అదియొనర్చిన వాదము క్షేమకరమే. అయినఁ గీర్తినిఁగాలఁదన్ని క్షేమమునుమాత్రము దెచ్చికొనుట భీరుత్వ మనిపించును. ప్రాణలోభ మనిపించును. కావున నది సరిపడదు. యుద్ధ జయమా ? దైవాధీనత గలుగఁగలదు. దానికెవ్వరు పూటగాఁ గలవారు ? మీఱివచ్చి నను నింద్రభోగముఁ బడయఁగలవారము. ఇందు జగన్నుత యశమయినను నందుఁ జిరంతనభోగమైనను సమకూరు. ఇట్టిసమయ మెన్ని దినములకు లభింపవలయు ?

అదిగా కిప్పటి యుద్ధమున మనయెడ నొకవిశేషముగలదు. ఇంద్రునోర్చి ఖాండ వముదహించినట్టియు, రుద్రునోర్చి పాశుపతము గ్రహించినట్టియుఁ, గౌరవానీకము నుఱుమాడి రాజ్యము వహించినట్టియుఁ, గనకెవ్వరీడులేరని గర్వించి దిగంతముల ఘోటకము విడిచి దాని రక్షగా నేనుండ నెవరు పట్టువారని వీరగర్వకంకణమును చేఁబూని యీఘనకార్యము నిర్వహించినట్టియు నాక్రీడిని మనము జయించితిమా. మనకెవ్వ రీడుగాఁగలరు ?

మనకంటె నెవ్వరు విఖ్యాతులు గాఁగలరు ? ఆ యింద్రుఁ డారుద్రుఁ డాకారవు లెల్లరు మనచే నిర్జితులని యెంచఁబడరా? ఇంకఁబరాపజయముకలిగెనా మనకేమియు లోపములేదు. లోకమువారందఱు నిట్టిక్రీడితో నని సేయ నుద్యమించిన మనధీర గుణముఁ బ్రశంసింతురుగాక మనపరాజయమును లెక్కింపరు. పరాజితులమైనను రుద్రుతోడ నింద్రుతోడఁదులఁ దూఁగువారమగుదుము. ఎట్లును మనకుఁ గీర్తికాస్పద ము తటస్థించెను. ఈ మాలతివచించిన తీరున మన మోహవాగురులే నర్జునాదులు పడిరా యింకను విశేషమే. అప్పు డీమంజువాణి వచించిన భంగియుద్ధమును సంధియు సంధియుయుద్ధమును గలిగినట్లగు.

చ॥ జగముననీడుగల్గని భుజాబలసార మహాస్త్ర సంపదన్ ।
బగతురనెల్ల గెల్చి జనవందితకీర్తి నెసంగియున్నమా ।
కగుసమరంబుదాన జయమైనఁ బరాజయమైనఁ గల్గుఁగా ।
కగణితకీర్తియిట్టి సమయంబు ఘటించునె ధీరకోటికిన్ ॥

ప్ర॥ సుయోగుఁడు.

సుయో.— (అనుబంధము 18.)

(నలుదిక్కులఁజూచి) (భీతియు నాశ్చర్యము నభినయించి)
మహారాణీ! మనస్కారము!

---

ప్రమీల—మహారాణీ యెవరు? మనస్కారమేమి? నీ వెవ్వరవు?

సుయో—నేను–నేను–నేను–నేను–అర్జునుఁడు–అర్జునుఁడు.

ప్రమీల—నీయట్టివాఁడా అర్జునుఁడు?

సుయో—కా-కా-కాదు. రాయ-రాయ-ఛూ-గుయ్యో స-కాదు యోగు-దీని తల గాల-ఊఁ సుయోగుఁడు.

ప్రమీల—సుయోగుఁడవుకాని దుర్యోగుఁడవుగాని యేలవచ్చితివి? నిన్నెవ్వరిందు రానిచ్చినది?

సుయో—ఆయమ్మ. ఆపె. అదిగో.

ప్రమీల—ఏల వచ్చితివి?

సుయో—దేవీ! నన్ను రాయభారి అర్జునుఁడుగా-కాదు రాయవారికి అర్జునుఁడమ్మా-అయ్యో! ఇట్లేల గల్కుచున్నాను? ఛూ-ఛూ-కాదు. చేతఁగాదు.

ప్రమీల—(కోపమున) దురాత్మా! ఈ యొడ్డోలగమున మము నవ్వులాడవచ్చి యున్నావా? నీకుఁ దగినశిక్ష విధింతును.

సుయో—కాదమ్మా, అవునమ్మా, లేదమ్మా.

ప్రమీల—పలుంగాకీ-నీవిందు హాస్యమాడవచ్చి యున్నావా?

సుయో—అవునవును, కాదుకాదమ్మా.

ప్రమీల—కనకలతా! వీనికిఁ దగిన బుద్ధి చెప్పుము.

కనక—(లేచి సుయోగునిఁ గొట్టును, ద్రోయును.)

సుయో—(త్రోపువడి) అయ్యో-అయ్యో-ఈ జాబు- ఈ జాబు.

కనక—ఏమిజాబు? అవివేకీ!

సుయో—(తనయంగీలోపలనున్న జాబుఁదీసి) అమ్మా-అమ్మా-ఈ బాజు చీకో.

ప్రమీల—జాబనుటకువచ్చినతిప్పలా? కనకలతా! యేమున్నదో యా జాబునుదీసికొని చూడుము.

కనక— (చదువును.)

"శ్రీమదంగనా మండల రాజ్ఞియగు ప్రమీలా దేవికి – రాజశేఖరుఁడును రాజశేఖరు సఖుఁడును నగు నర్జునుఁ డొనరించు విజ్ఞప్తులు.

పాండుభూప ప్రజాగ్రజుం డగు ధర్మాత్మజుం డొనరించు హయ మేధసవనమునకై తిరుగవిడచిన మాయాజానేయము మీసీమను మీవారిచేఁ గట్టఁబడియుండుట నీ వింతవఱకు నెఱుఁగకున్న నిప్పు డైన నెఱుఁగఁగలవు. నీకుఁ దెలిసి మీ వారివలన నీ కార్యమొన రింపఁబడినదని నేనమ్మఁజాలను. కావున నిందుకుఁ బ్రతిక్రియగా నా యుత్తమాశ్వమును గొనివచ్చి మాకర్పింపవలయు. నీకుఁ దెలి సియే యీ కార్య మొనరింపఁబడియున్న నిది దుష్కృతమని వచించుచున్నాను. అబలలకు మీకు మాయట్టివారితోడి వైర మనుచితము. ఫలప్రాప్తి లేకుండుట యిట్లుండ ననర్థములు ప్రాప్తింపఁగలవు. శివునితో నింద్రునితో భీష్మాది కౌరవులతోఁ గాలకేయాది రాక్షసులతోఁ బోరాడినది నేన చెప్పికొన్న నాత్మ స్తుతికాఁగలదు. నీవు నారీజన మతల్లివనియు యుక్తాయుక్త పరిగ్రహణ శీలవనియు జనులందఱందురు. కావున మా ఘోటా ణము మాకర్పించి స్తుతిపాత్రవయ్యెదవో లేదేని బాణానల మునకు నింధనమపై మృతిపాత్ర వయ్యెదవో నీవే ధృఢీకరింప వలయు. విశేషములు వ్రాయఁజాలను.

ఇట్లు,

వైరి రాజేంధన ధనంజయుఁడు,

ధనంజయుఁడు.

ప్రమీల—(జాబు చేతఁదీసికొని) అవురా! ఏమి యీపాండిత్యము. మే మబలలమయినఁ దానెంత సబలుఁడో పరీక్షించెదముగాక. ఆత్మస్తుతి కూడదఁట. శివుని జయించి నాఁడఁట. ఒక భిక్షువును జయించిన మాత్రమున నింతప్రతాపమా? ఉత్తమాశ్వ మును దనకర్పింప వలయునఁట. వలయునన్న వానినే యశ్వముగా నొనరించి యెక్కి తిరుగాడఁజాలనా? ఓరీ! రాయబారీ! యిట్టి తుచ్ఛపత్రికలు వ్రాయ కుండ వానిధనంజయుకు నే నింతలోననే నాసర్వతోముఖ పాండిత్యము ప్రక రింపఁజేసి యూర్చెదననుము? పొమ్ము.

సురయో—పోవ. పోవ-పోవలెనా?

ప్రమీల—మలయవతీ! వీఁడు పోవలేఁడఁట. కొంచెము చూడుము.

మలయ—(సుయోధనుని మెడఁబట్టి త్రోయును.)

సుయో—అమ్మా! అమ్మా! ఓసి-ఓసి-యేమి-యేమి ?

(నిష్క్ర.)

ప్రమీల—చూచితిరే సఖులారా! ఈ యర్జునుని యహంకృతి! దీనికిఁ దగినశాస్తి మన మొనర్పకున్న మనయంగనాత్వమునఁ బ్రయోజనము లేదు. మనమందఱము కృతసిద్ధుల మైయుండవలయు.

మలయ—దేవీ? నీవఱకుఁ బనిలేదు. మేమే యిందుకుఁ జాలెదము. మాకు మీఱి వచ్చినఁగదా నీవు వెడలవలయు ? కాదంబినీ—మంజరీ—మాలతీ—కనకలతా మనము కృతసన్నాహుల మగుదము. పోదము రండు.

(నిష్క్ర.)

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## తృతీయాఙ్కము-ప్రథమరంగము.

### యుద్ధభూమి.

[ప్ర: సాత్యకి-ప్రద్యుమ్నుఁడు-సాంబుఁడు-సారణుఁడు-నీలధ్వజుఁడు-సుయోగుఁడు-వృషకేతుఁడు-అర్జునుఁడు-మేఘవర్ణుఁడు.]

అర్జున—సుయోగా! రాయభారమున నీకుఁ గలిగిన యున్మాద మిప్పుడైనను దీఱెనా? చక్కఁగ యుద్ధమునకు నిల్చెదవా లేక యింకను నాప్రమీలను నర్జునరాణియని పిలుతువా?

సుయో—దేవా! నాకున్మాదమని యేల పలికెదవు? ఆకామిను లెట్టి పురుషులను నవలీలగఁ గటాక్ష మాత్రమున నిర్జించువారు. తుదకు నీవైననేమి? ఆ దేవినిఁ జూచితివా గుఱ్ఱమును గోదావరివైచి యజ్ఞమును గంగకుఁదోలి యామరణము నిందే యుండు చుంటివి.

అర్జు—సుయోగా! నీమాటలింకఁ జాలింపుము. నీప్రజ్ఞవిశేషమయ్యె. యుద్ధముచేయ నుత్సాహము గల్గిన నిందుండుము. ఆ కామినుల సౌందర్యమును వర్ణనచేయుతలంపు గల్గిన శిబిరమునకుఁబోయి యందుండి నీ మనసార స్తోత్రముచేసి కొనుము.

ఉ॥ మంచివినోదమాయెఁ బలుమాఱును నిక్కడి నారులంప్రశం।
సించుటమానవైతివిటు చెల్లునె వీఱిడిబుద్ధి పుట్టఁగా।
నించుక నీమతంబు గణియింపఁగ వైరులయుద్ధభూమి ని।
ర్జించెదొ కాకవారిపద సేవయొనర్పఁగఁ బాఱిపోయెదో॥

ప్రద్యుమ్నా! నీలధ్వజా! సాంబా! సారణా! సాత్యకీ! మేఘ నాథా! మీరెల్ల నీ మాట పాటింపుఁడు. ఈ రాజ్యమున స్త్రీలు కడు సత్వము కలవారని మనము వింటిమిగదా? బాహు సత్వమునకంటెను కటాక్షసత్వమే వారి కెక్కువగాఁ గలదు. ఆ సోగకన్నుల సోయగపుఁ జూపులకు మరులుగొననివా రుండు టరిది. అయిన వారిఁగలసిన మానవులు నెలనాళ్ళలో సత్వహీనులై మృతిఁ జెందుదురని మనము వినియుండలేదా? ఈ విషయము మఱవక వారి మోహరజ్జువులఁ దగులుకొనక యేమఱ కుండవలయుఁజుండీ. యుద్ధమునకు మనమిందొక మార్గము వెదకవలయు. మనమెల్ల నూరకొక్కయెడ నుండక వేఱువేఱు మార్గములఁజని యీ సాలభేద్ధనం బొనర్పవలయు. ఇంతలో నాతరుణులే యుదమున కేతెంచిరా మఱియు మేలాయె.

ప్రద్యు—మామా! అంతయు నెఱిఁగితిని. నీ విందేల యుండవలయు. ఉండినను నీవు యుద్ధమాడువాఁడవు కాదుకదా?

అర్జు—ప్రద్యుమ్నా నిక్కమాడితివి. అంగన పేరుగల పురుషులతోడ నేనే-అర్జునుఁడు-యుద్ధమాడనని ప్రతిజ్ఞ చేసుకొనియుండ నంగనలతో యుద్ధమాడుదునా? అయినను మీకలను చందము పరికించుచు నే నిందే యుందును.

మేఘ—ఈ తుచ్ఛాంగనల నిర్జించుట కతఁడు కావలయునా? నేనొక్కఁడ నాపనికిఁ జాలుదు. నీవిందేల యుండవలయు? ప్రద్యుమ్నాదులతోఁ బురము ముట్టడించి కోట పటాపంచలుగఁజేసి హయము సాధించుకొని వచ్చెదము.

అర్జు—ఘటోత్కచ కుమారా! నీయిష్టము. నీ చేతఁగాని పనియుండునా? నే శిబిరమున నే యుండెదను. మీ జయోదంతము నాకువచ్చి యెఱింగింపుఁడు.

(నిష్క్ర.)

మేఘ—ప్రద్యుమ్నా! మనమందఱము వేఱువేఱుగాఁ బోవుదము. ఈ నీలధ్వజుఁడు తన సేనతో వృషకేతునితోడ నుత్తరపువాకిట నుండువాఁడు. ఈ సాంబసారణులు పూర్వపు గవినియెడ నుండఁగలవారు. సుయోగునితో సాత్యకి దక్షిణమునఁ గావలి యుండఁగలఁడు. నే నిందే యుండెదను.

(మేఘునాథుఁడు తప్ప నందఱు నిష్క్రమము.)

మేఘ—ఇదియేమీ మాప్రాప్తి. వీరశ్రేష్ఠులతో నెందఱితోడనో సంగ్రామ మొనరించితిమి. ఎందఱినో జయించితిమి. తుదకు నేఁడీ యబలాజనముతో సంగ్రామము వాటిల్లెనే? అయినను దగినకొలఁది సాంత్వన వాక్యములఁ జెప్పిచూచెదను. ఎక్కడికిని సాధ్యముకాకున్న నుండనేయున్నది. అందేమో తుములము వినిపించుచున్నది. పోయి చూచెదను.

(ప్రక్కకు నిష్క్ర.)

[ప్ర: కాదంబిని-కనకలత-మాలతి-మంజరి-మలయవతి-చారుమతి-మంజువాణి.]

---

మలయ—మ॥ ఇదె నేడున్నది మాయదృష్టసమయం బిందీవరాలోకలా।
ర దిగంతంబులఁ గీర్తినిండ నరిఁబోరన్వీడ కుత్సాహ మూ।
ని దరంబించుక లేక పోరుఁడు హిమానీరాత్రులన్ నాథులన్।
వదలన్ లేక సతుల్పైనంగువగనిండన్ జూపి సాధింపుఁడీ॥

సోదరులారా! నేఁడున్నది మనయదృష్ట పరీక్ష. మీరందఱు దిట్టలే యని నేయవలయు. ఇంతకుము౦ దారథికులందఱు నిక్కడఁ జేరియుండిరని వింటిమే వారెందుఁ బోయియుందురు? ఆహా! తెలిసెను. అదే యావైపున ధూళి యెగయుచున్నది. మఱి యీవైపున రథనేమినిస్వనములు వినిపించుచున్నవి. ఆ యెడ భటుల కోలాహలము శ్రవణగోచర మగుచున్నది. ఈ రథికులందఱు న్లొక్కరొకరు నొక్కొక యెడకుఁ బోయినట్లు గోచరించుచున్నది. మనము నష్టోపాయులు గావలయు. వారిలో నారాక్షసుఁ డుండెఁగదా వాఁడెందైన నగుపడిన నాకెటిఁగింపుఁడు. వాఁడు కడుమాయావియని తోఁచుచున్నది. నాకుఁగల మాయోపహార విద్యకుఁ దక్కవాని జయించుట దుర్లభము పొండావైపున. కలకలము వినిపించె.

(మలయవతి తప్ప అందఱు నిష్క్ర.)

ఎవ్వఁడు వాఁడియ్యెడకు వచ్చుచున్నవాఁడు? ఆహా! పిల్లివెదుకఁ బోయిన యెలుక దానినోటఁబడినట్లాయెను. వీఁడే యారాక్షసుఁడు. వీనిఁజించి చెండాడెద.

[పునః ప్ర: మేఘవర్ణుఁడు.]

మేఘ—శా॥ ఆహోహో! యిటులౌనె యాగడము పూర్ణాశ్లేషమింపారఁగా।
బాహాభ్యంతరసీమ నిల్పిమదన ప్రఖ్యాతి సంగ్రామస।
మ్మోహాయత్తలఁజేయఁగల్గఁదగుసొంపున్ మానియీనాగలన్।
బాహాబాహి కచాకచిం బెనఁగు దీనత్వంబు చేకూరునే॥

(అనుబంధము 9.)

(స్వ) ఆహా! ఈ యబల ధనుర్బాణ తూణీరపాణియై కదనమునకు వెడలినదానివలెనున్నది. దీనిం బొలిముద్దగాఁ గైకొందుఁగాక. (సమీపించి) ఆహా! ఏమి యీకామిని సౌందర్యము! సాక్షాత్కరించిన రతీసతివలె నున్నదిగదా! రాక్ష

సుఁడనైన నాకే భ్రమపుట్టించుచున్నది. అయ్యో! హయసాధక ఘనకార్యమును బూనిన నేనిట్లాడనచ్చునా? (ప్ర) అబలా!

మలయ—ఆ మాటనకుము. నీ మెడతునియలైపడును.

మేఘ—ఓహో! అబలాయన్న నీకుఁ గోపమా? అట్లయిన మానెదను. ప్రబలా ఇదే మిట్లాయితమై వచ్చితివి?

మలయ—సంగరమున నినుఁజించి చెండాడుటకు.

మేఘ—అనంగ సంగరముమాని యీ సంగరము నీకేల?

మలయ—ఇదె నీ కా దేవలోకముననున్న యప్సరసలతో నాసంగరమే కలిగించెద. చక్కఁగ నిలువుము.

మేఘ—అబలా—కాదు, ప్రబలా! నీమోముచూచిన నింతముద్దు కాఱుచున్నదే? అది యీబాణక్షతముల కెట్లోర్చెడు? చంద్ర సుందరమైన యీమోము దమ్మి నే బాణము నెట్లువైవఁ గలను?

మలయ—"ఎట్లు వేయగలవా?" ఇదిగో

(బాణము వేయును.)

మేఘ—(స్వ) ఈ కోమలాంగి హస్తములు కుసుమములఁబోలెఁ గన్పట్టినను బాణములు మాత్రము నిశితములయ్యె. ఇంకఁదడసినఁ బ్రమాదము.

(అనుబంధము 10.)

మేఘ—కామినీ! నీవంగన వగుటఁజేసి సుమకోమలమగు నీమేను కసిగందునని శంకించి క్రీడాయతి నాబాణములఁ బాతించిన నాసత్వమింతే యనుకొంటివి కాఁబోలు. ఇదె నాగదచే నీతలఁ బగల్చెద.

(అని కొట్టఁబోవును.)

మలయ—నాబాణమున నీగద యేమాయెఁజూడుము.

మేఘ— (అనుబంధము 11-12.)

మేఘ—(మాయమగును.)

మలయ—ఈ మాయావి రక్కసుఁడు మాయయుద్ధము చేయుచున్నాఁడు కాఁబోలు. ఆహా! ఈబాణమెంత తీవ్రముగా నను నాటెను? ఇంక నా మాయోపహారవిద్యను బ్రయోగించెద. (కత్తి త్రిప్పును.)

మేఘ—(క్రిందఁబడును.)

మలయ—(త్రాళ్ళచే వానిఁగట్టును,)

మేఘ—తరుణీ నాయాన. నీతో యుద్ధమాడు నభిలాషము నాకులేదు. నీకుమాయోపహారవిద్య వచ్చుట నేనెఱుఁగనైతి. ఈ బంధనములు నాకొక యామ మాత్రమే కదా యుండఁగలవు? నీవు ననుఁగౌఁగిలింతువని నమ్మికపుట్ట నొక్కింత మాటయిచ్చితివా చచ్చుటవఱకు నిట్టి బంధనముననే యుండఁగలను. అనుగ్రహించి వాగ్దానమిమ్మా.

మలయ—రాక్షసా! సంగ్రామము నాకెందు కంటివే.

మేఘ—ఇప్పుడుమాత్ర మీసంగ్రామము నేఁ గోరనే?

మలయ—ఊరకట్లు పడియుండుము. ప్రేలకుము.

మేఘ—అయిన నా ప్రార్థన మిచ్చినట్లేగదా?

మలయ—ప్రార్థనమేమి? ఊరకుండుము. నీచోటనిన్నుంతును. పోదము రమ్మా.

మేఘ—ఏచోట? నీపడకటింటనా?

మలయ—అవును నీపడకటింటనే. పగులనక రాత్రియనక యందుఁబండుకొనియుండవచ్చును. వెలికిరాకుండ బీగముమాత్రమువేసియుందుము. (అని యీడ్చుకొనిపోవును.)

మేఘ—(పోవుచు) ఆహా! ఈ యంగనసాంగత్యమే నన్నునేమఱుమనట్లు చేయుచున్నదే! (నిష్క్ర)

[ప్ర: సాత్యకి మాలతి యుద్ధమాడుచు.]

సాత్యకి—కామినీ! నేను గౌరవయుద్ధమున వృద్ధుఁడనై గడిదేఱినవాఁడ. నీవో కన్నులు తెఱచియుఁడెఱవని ముద్దరాలవు. నీచెక్కులు జీరిన నవనవలున్నవి పాలోడనానీకు యుద్ధము! ఈసాత్యకి ప్రభావముకావలెనన్న నా సైంధవుఁడు పడిన యుద్ధమునాఁడుండిన వారినెవరినైన నడుగుము.

మాలతి—ఆప్రభావము నెవ్వరినేలయడుగవలయు? సమక్షముననే తెలియునుగదా? ఊరకయని సేయుము.

సాత్యకి—రమణీ! నినుఁజూచిన నాకన్నులకుఁ బరమానందము జనించుచున్నది. ఆనరకాసురునిఁ జంపిననాఁడున్న సత్యభామవలె నున్నావు. సుందరమగు నిట్టి నీమేను నా నిశితబాణపరంపరల కేలపాలుచేసెదవు? చెడక యూరకపొమ్ము.

మాలతి— (అనుబంధము 13.)

సాత్యకి—(స్వ) ఆహా! ఆకౌరవులయుద్ధమున ననునాటిన నెందఱువీరులయొట్టిబాణము లయినను నింతవాడిగలవికాకుండె. ఇంచుకవయసు చెల్లినందున నాకీబాధకలిగెనా? లేక యీతన్వియేయంత బలశాలినియా!

(అనుబంధము 14.)

తరుణీ! నీధనుర్విద్యా కౌశల్యమునకుమెచ్చితి. నీవేమడిగిన నడుగుము. లేదన కిచ్చెదను.

మాలతి—నాకుఁగల భాగ్యభోగములు నాకుఁజాలి నీయట్టిశూరిఁ బదివేవురఁ దనియఁజేయు నంతకలవు. అయినను నీవైయిచ్చెదనన్న వలదనను, నాకు రణదాన మిమ్ము.

సాత్యకి—(స్వ) ఔరా! ఎంతధీరగుణము. (ప్ర) రమణీ! నీపేరు మాలతియంటివిగా? ఎంతతగనిపేరు! ఆమాలతీలతకున్న మార్దవమునకును నీకుఁగల రణధీరత్వమునకును నేమిసంబంధము? అసిధారయని నీకుఁబేరుండిన బాగుగనుండును.

మాలతి—(స్వ) ఎంతమనఃపూర్వకముగ నుతియించుచున్నాఁడీరతికుఁడు! నిక్కంపు శూరుఁడు గనుక నేనన్నిట్లు ప్రశంసింపుచున్నాఁడు. (ప్ర) వీరపుంగవా నేను స్త్రీ త్రముఖకు జయింపఁబడుదానగాను, సత్వముండిన సమరముచేయుము కాకున్నఁ జితుఁడ నైతివనుము. నినుమాని శూరుఁడున్న రెయుంటెడకుఁబోయెద.

సాత్యకి—(కోపమున) తెఱవా! నీక్షేమముఁగోరి నే నాడినమాటలు నీ కంత శ్రుతి కటువులాయెనా? నిన్నోటుపఱచుట వింతయా?

(అనుబంధము 14.)

మాలతి—(క్రిందఁబడి) ఆహా! ఈ శూరాగ్రేసరునితోఁ గదనము పండుగుఁబోలె నన్నల రింపఁజేసె.

సాత్యకి—తరుణీమణీ! నేవలదన్నను మానక నాతోఁ గదనమున నుద్యమించితివే. ఇప్పు డు నీదేహవల్లి యెంతనొచ్చుచున్నదో. (శరీరము నూరును.)

మాలతి—(లేచి) ఇంతటితోఁ దీఱెననుకొంటివా? ఇదె నాబాణము వేడి నింతపరీక్షింపు ము (వేయును.)

సాత్యకి—ఆహా! (అనిక్రిందఁబడి) అన్నుతోదరీ! ఇట్టియధర్మయుద్ధము నీకుఁజెల్లునా? విరథుఁడనై విగతశరాసనుఁడనై యున్నవేళ నలుగు నేసితివి.

మాలతి—చాలును లెమ్ము నీధర్మము, నినుఁగ్రిందగెడపి కరవాలమునఁ గంఠమునఱుకనున్న భూరిశ్రవసునిఁ గృష్ణునామంత్రణమున నర్జునుఁడు కేలుద్రెంపి క్రిందఁబడవేయ నప్పు డా భూరిశ్రవుని నీవుచంపితివే యప్పుడు నీధర్మగుణ మెందుండెను? (త్రొక్కఁగట్టును.)

సాత్యకి—(కట్టుటకుఁజేతులిచ్చి) ఆహా! నీయట్టికోమలాంగిచేఁ జేతఁబంధింపఁగను పుణ్యము కొంచెమా? కోమలాంగియనుటమాత్రముగాదు. సాక్షాత్కరించిన వీరలక్ష్మివి. నీమనసారఁగట్టుము. ఒక్కింత మోము మోమునమాత్రము సేర్పుము.

మాలతి—ఊరకుండుము చాలు నీముదుసలి మోహములు.

సాత్యకి—తప్పఁబలికితివి. శరీరమునకేమైన వార్ధక్యము రానున్న రావచ్చుఁగాక నా మోహముమాత్రము కడుంగడు తరుణముసుమా.

మాలతి—(సాత్యకి నీడ్చుకొని.) (నిష్క్ర.)

ప్ర: వృషకేతుఁడు మంజువాణి ఆర్భటించుచు,

వృషకే— (అనుబంధము 15.)

వృష—ఆఁగా! ఈకర్ణసూతి వృషకేతు నెవ్వనిఁగాఁ దలంచితివి?

మంజు—ఓహో! నీవు సూతసూతి సూతివా? నీకేటి కీక్షాత్రగుణము?

వృష—మాయయ్యను సూతసుతుఁ డన్నవానినాలుక తుండ్లుసేయ నేఁ బ్రతిజ్ఞవట్టితి. అతఁడు పాండురా జాదిమకుమారుఁడని యెఱుఁగవో? ఏదీతాళుముచూత మీతీవ్ర బాణము. (ఎక్కువెట్టును.)

చారు—(వృషకేతుని వెనుకనుండివచ్చి గిలిగింతపెట్టును.)

వృష—(ఉలికిపడి ధనువు బాణమువిడిచి వెనుకకుఁదిరిగిచూచును.)

మంజు—(పరుగెత్తివచ్చి వృషకేతునెత్తికొనిపోవును.)

ప్ర: సుయోగుఁడు అనుబంధము 16.

సుయో—ధూర్తా! ఏమియుఁదెలియనిబాలు నిట్లుచేసితివా? ఏదీ! యిటువచ్చినిలువుము.

చారు—నీవెవరవు? లాణీయని మాదేవినిఁ బిలిచిన లాయబాలివా? అలాజు నేమి చేసితివి?

సుయో—నీవుణ్యమగు నూరకుండుము.

చారు—నేనెట్లూరకుందును? నన్నెఱుఁగవా? మనత్కారము మఱచితివా?

సుయో—(యోచించి) నన్ను మీదేవియొద్దకుఁ బిలుచుకొనిపోయిన చెలువవునీవేకదా?

చారు—(స్వ) వీఁడు మిక్కిలి భ్రాంతుఁడుగానున్నాఁడు. ఏయుద్ధములేక వీనిజయింప వచ్చునని తోఁచుచున్నది. (ప్ర) అవును నేనే, యింతలోమఱచితివా?

సుయో—నీ పేరేమి ?

చారు—పేరేమఱచితివా? నేనేమని చెప్పితిని ?

సుయో—ధీరగుణయని యేమో చెప్పితివిగదా?

చారు—కొంచెమే వ్యత్యాసము. ధీరగుణగాదు, చారుమతి.

సుయో—చారుమతి యన్నట్టులేదు. ఏమోయెవ్వఁడెఱుఁగు ? అప్పుడు నేనుండినస్థితి లో రాముఁడని చెప్పిన రావణుఁడనుచుంటిని. చారుమతీ ! చూచితివా నీ వెంతమోస కారివి ? నీరాణియొద్దకుఁ బోయివచ్చిన వెంటనే నాకాశ్లేషసౌఖ్యమిచ్చెదనంటివే ? తప్పితివే?

చారు—అయ్యో ! భ్రాంతుఁడా ! నిన్నుఁ బిలుచుకొనుచు నీ వెంటఁ బరుగెత్తివచ్చినను మాటలాడక పాఱిపోయితివే ?

సుయో—(తలను మెల్లగాఁగొట్టుకొని) పాపిష్ఠిజ్ఞాపకము, పాడుబుద్ధి, ధీరగుణా ! నే నప్పుడు నిక్కువముగాఁ బాఱిపోయితినా ?

చారు—అదిగో, యప్పుడే చారుమతి యనుమాటమాని "ధీరగుణా" యనసాగితివి. పేరు మఱచువాఁడవు ప్రేమమఱవకుందువా ?

సుయో—అయ్యో ! అయ్యో ! ఈమాటననఁదగునా ? నీముద్దుగారు మోముచూచిన నెక్కడలేని ప్రేమయుఁ ద్రవ్వికొనివచ్చుచుండ, నున్న ప్రేమపోవునా ? ఇప్పుడైన నీయాశ్లేషసుఖమిచ్చెదవా? (తిరిగిచూచును.)

చారు—నామాట యొనరించిన నీకాశ్లేషసుఖము, మఖాసుఖము, పుబ్బాసుఖము అన్నియునిచ్చెదను.

సుయో—దేవి ! నీ వించుక యాజ్ఞయిచ్చిననజాలునే. ఏలసినపని యొనరింతును. ఏమి చేయుమ్మంటివి ?

చారు—ఇందుఁ బండుకొనుము.

సుయో—ఇక్కడనా ? ఇచ్చోటనా ?

చారు—ఎక్కడనైననేమి? ఎచ్చోటనైననేమి ?

సుయో—(సంతోషమున) ఆహా ! అవశ్యముపండుకొందును. (పండుకొని) ఏమి చేసెదవు?

చారు—బోరగిలఁ గమ్ము.

సుయో—అదేల?



చారు—ఇన్ని ప్రశ్నము లడుగువాఁడవు నీవుచెప్పినపని చేయుదువా? ఊరకపొమ్ము.

సుయో—లేదులేదు. వలదువలదు. పండుకొందును. (బోరగిలఁబడును.)

చారు—నీచేతులిట్లిమ్ము.

సుయో—(వెనుక చేతులిచ్చును.)

చారు—(చేతులఁబట్టి త్రాళ్ళఁగట్టును.)

సుయో—అయ్యో! ధీరగుణా! చారుమతీ! యిదియేమి? యిదియేమి?

చారు—ఇది యాశ్లేషసుఖము. (తలపొడిచి) ఇదిమఖసుఖము. (వీపునఁగొట్టి) ఇది కడు పుబ్బసుఖము. (తలయెత్తి ముఖముచూచి) ఇది యుత్తరసుఖము. (చేతులల్లాడించి) ఇదిహస్తసుఖము. ఇవన్నియుఁ గలసినఁ జిత్తసుఖము. స్వాతిసుఖమందున్నది. పోదమురమ్ము. (ఈడ్చుకొనిపోవును.)

ప్ర: ప్రద్యుమ్న.

ప్రద్యుమ్న—గీ॥ వేఁడిగలభుజమేపారు వీరులెల్ల।
చేడియలమోహశరములఁజిక్కి నేఁడు।
బేలలగుచును బాలావిలోలురైరి।
కామినులను గెల్చుఘనుఁడీకాముఁడొకఁడె॥

ఆవైపునఁ గోటవాకిటఁ గాచికాచి వేసరితిని. మనసైన్యమేమాయెనో భటులేమైరో రథికులేమైరో యెందెందు వెదకినను గనుపడకున్నారు. మేఘనాథుఁడుండిన యెడకు వచ్చినసైన నేమైనఁ దెలియునేమోయని వచ్చితి. ఇందు మేఘనాథుఁడును లేదు, మాఘనాథుఁడునులేదు వీరందఱు నీపుర నారీమణులవలలలోఁబడిరనుట నిర్ధారణము. అయ్యో! ఇంతటి యవివేకులెందైనఁగలరా? కావలయునన్న వీరలకు నారులెందఱురారైరి. వైరినారులఁ గోరవలయునా? అదియు నిట్టిసమయమునను? అర్జునుఁడన్న స్త్రీలపై బాణముఁబూననని ప్రతిజ్ఞపట్టినాఁడు. కార్యసాధకము కావలెనన్న వీరివలనఁగాఁదగియుండెను. వీరే యిట్లు బేలలై బాలాలోలురైడీలువడిన నింకేమనవలయు? అంతమనసు బిగఁబట్టకున్నవెట్లు? తరుణులమోములఁజూడని బ్రహ్మచారులా? సన్న్యాసులా? ఇంక నేనొక్కఁడ నిలిచితిని. ఇప్పుడె సాహసించి పురిఁబ్రవేశించి కార్యముసాధించెద.

ప్ర: కనకలత.

ఇందెవ్వతెయో ధీరగుణమున భూరిరణమున కేతెంచుదానివలెనున్నది. దీని నిప్పుడ చక్కాడెద.

కనక— (అనుబంధము 17.)

ఓరీ! వీరసూ కుంతీపుత్రుఁడనియు, శివునిజయించినవాఁడనియు, లోకమున లేనట్టివాఁడనియు నింతప్రశంసచేసుకొని యింతదూరముంవచ్చితిరి. మే మనిసేయ వలయునన్న నిల్చువీరుఁడే లేఁడాయెఁగా? వచ్చినవారందఱు పరాజితులైచిక్కిరి. నీవెనఁడవో నిలిచినట్టున్నది నాచేతులతీఁటదీఱ రణమియ్యనోపుదువా?

ప్రద్యు—(చూచి యాశ్చర్యపడి) ఔరా! కామినీ నీ వీభూమినున్న మానవవనితవు గావు. వీరలక్ష్మి మోహనాకారమున నవతరించిన వీరమోహినివే, నినుఁజూచిన నాశస్త్రాస్త్రములన్నియుఁనుడిగె. కరుణించి నీయధరామృతపానమున కాజ్ఞయియ్య కున్న నేఁబ్రదుకను. రక్షింపుము, రక్షింపుము. (నమస్కరించును.)

కనక—వైరినిఁ జూచినంతనే ప్రణామ మాచరించు నీవేనాటిశూరుండవు?

ప్రద్యు—నేవీరుఁడఁగాను శూరుఁడఁగాను వీరుఁడ వేయని నీవన్ననిదే జితోస్మియనువాఁడను. నాసతిజగన్మోహనరూప విఖ్యాతియని తరుణుల వర్ణించునపుడు రతీసతీ సౌందర్యముగలదంచుఁ బ్రశంసించెదరు. ఎంతటియజ్ఞానులు! నీ సౌందర్యమున నావంతయయిన నారతికిఁగలదా? ఉండిన నేను నిన్నువిడిపించుచుంటినా? ఇపుడు జితోస్మియనువాఁడను. నీవంగీకరింపకున్న హతోస్మియనువాఁడను.

కనక—(స్వ) ఆహా! ఈ పురుషుఁడు నా సౌందర్యము నెంతవర్ణించుచున్నాఁడు! నాకెంతప్రీతిజనియించె! (ప్ర) కృష్ణకుమారా! నీకేలకలిగె నిట్టియశోహాని? లెమ్ము. ధనువుచేకొమ్ము. బాణములసంధింపుము కాకున్న నిను రణభీరుఁడందురు.

ప్రద్యు—కలికీ! నాకిది యశోహానియగునా? దివ్యాంగనలకైన లేని భవ్యసుందరతగల నీయట్టిసతి చేపట్టుట యావింతయశమునకు మూలముగదా? ధనువేల చేపట్టవలయు? బాణములేలకావలయు? మదనుఁడు కుసుమశరుఁడనియు, పంచబాణుఁడనియు, వాని శరీరము జగమునంతయు గెలుచుననియుఁ జెప్పుట యెంతయుఁగల్ల. నీశృంగార రూపముగల మోహిని కనుబొమలను రెండుధనువుల నొక్కసారియే యెక్కువెట్టి నీ కటాక్షములను బాణద్వయమునుమాత్ర మనుసంధించి నా హృదయపదమునంతు నగలఁజేయుచున్నదిగదా? కామినీ! నీవనుగ్రహింపకున్న నేఁబ్రదుకను. నిక్కువముగా నే బ్రదుకను.

కనక— (అనుబంధము 18.)

ప్రద్యుమ్నా నీవా రణవిశారదుఁడవు? నీయట్టికాతరులతో నాకేమిపని? వేఁ యొడకుఁబోయెద. (పోవ)

ప్రద్యు— (అనుబంధము 19.)

వధూమణీ! నీయట్టి వీరమోహిని శరణాగతాభయదానవ్రతము పూనకున్నఁ బ్రయోజనమేమి? ఏదీనుఁడ. నినుశరణొందినవాఁడ. పోషింపుమా. (నమస్కరించును.)

కనక—అట్లయన నినుఁగట్టివేసెద.

ప్రద్యు—నీబాహువల్లురులతోడనా?

కనక—కాదీరజ్జువులచేత.

ప్రద్యు—అవియే నీబాహుమృణాళములని భావించి తృప్తిఁజెందెద.

కనక—నిను నిర్బంధముననుంచెద.

ప్రద్యు—నీయంతఃపురమునను?

కనక—కాదు, కారాగృహమున.

ప్రద్యు—అందు నీవు నాదండ నుండుదువుకదా?

కనక—ఉండను.

ప్రద్యు—దర్శనమైననియ్యవో? గంటకొకసారి లేక దినమునకు-వారమునకొకసారి?

కనక—ఏమో, అదేలయడిగెదవు?

ప్రద్యు—నీయిష్టము వచ్చినట్లొనర్పుము.

కనక—అయినఁగానిమ్ము. (బంధింపఁబడును.)

(ప్ర: మంజువాణి.)

కనక—మంజువాణీ! నీవేమొనర్చితివి?

మంజు—కాదంబిని మొదలగు వారొక్కరొక్కరు, నొకని, నిరువురవీరుల మనదేవి కప్పనముగాఁ బట్టితెచ్చియున్నారు. నీకొఱకై నిరీక్షించుచున్నారు. నేనావృషకేతుఁడనుబాలుని పొంబుఁడనువానిఁ, గాదంబిని యానీలధ్వజునిఁ బట్టితిమి. పోదమురమ్మా.

కనక—ఈ మృగమును గొనిపోవుదము. (నిష్క్రి.)

(ప్ర: నీలధ్వజుఁడు.)

నీల—కం॥ సందేహమయ్యె మనవా
రెందుంగనరాను, కదనమేగతిఁగనెనో
యందఱును గెలిచిరో గా,
కిందలిసుందరులవలల నింపుగఁబడిరో ॥

(అనుబంధము 20.)

ఆహా! వారిగతియేమి? ఇంక పవనతురంగము గతియేమి? ఆవైపువ జరుగుచున్న యుద్ధమంతయు నట్లేనిలిచెను. ఎందుకో? ఎందుఁజూచినను ధనుష్టంకారమే విన

రాదు. ఇంకెక్కడిటంంకారము? అహంంకారము? తీఱినది. అర్జునుఁడింక నేగతి యశ్వముఁ బడయువాఁడు? ఊరక యోచనలఁ బ్రయోజనము లేదు. నేనైనను జక్కఁగ యుద్ధమాడి వీరల జయింపవలయు. మహామహులని రణభయంకరులని యున్నవారి గతియంతయు నిట్లయ్యె. వారి నేలననవలయు ? శృంగారరసము మూర్తీభవింపఁజేసినట్టు లీయంగనామణుల సృజించిన బ్రహ్మననవలె. నేనుమాత్రమో బీరములు పల్కుచున్నాను. కాని యీనారీజనము దృగ్గోచరమైన నేమయ్యెదనో? అదిగో! దాపున నెవ్వతెరో ధనుర్బాణములఁ బూనివచ్చు చున్నది. అది రతీసతియగు.

ప్ర—మంజువాణి.

రమణీ! ఈ జగన్మోహనరూప మూని యేయభిప్రాయమున నిర్యోడకు వచ్చితివి? నీవేల రావలయు? నీపేరేమి?

మంజు—నేమంజువాణి యనుదాన. నాకుఁ గావలసినది ధీరయుద్ధము.

నీల—“ధీరయుద్ధము”? తప్పుఁబలికితివి. తొలియక్షరము కడుకఠోరము.

మంజు—ఛీ! ఎవ్వఁడును యుద్ధమిచ్చువాఁడే లేఁడు.

(నిష్క్ర.)

నీల—అయ్యో! ఈ కామినిపోయె. ఇంక నేనెట్లు నిర్వహింతును? అస్త్రప్రయోగ మవలంబించి దాని వెనువెంటఁబోయెద.

ఈచాన కాన కటువోయె. ఇంతైనఁగరుణలేదాయె. తుదలేని, నిందువెతలాయె. ఇంతైనఁ గరుణలేదాయె. ఓ మనోజ్ఞకలవాణి, ననుఁ గనంగద వెరాణీ, మంజువాణీ రా వెనాపొంత.

(నిష్క్ర.)

---

శ్రీ

# ప్రమీ లా ర్జు నీ య ము.

## తృతీయాంకము-ద్వితీయరంగము.

### ప్రమీలసభ.

[ప్ర: ప్రమీల-కాదంబిని-కనకలత-చారుమతి-మాలతి-మంజువాణి-మలయవతి-మంజరి.]

ప్రమీల——సఖీమణులారా! ఏమి పిలిపించితిరి? మీ రేలయిట్లు దీనభావమొంది యున్నారు? మీ మోములు తప్తములయ్యె మందస్మితము మానకున్నవే. ఇదేమి?

కనక——దేవీ! వచ్చినకార్యము నివేదింపక తీఱదు. నేటికి జగద్విదితమగు మాయశముంతయుఁ గొల్లవోయె.

ప్రమీ——హా! హా! ఏమి! ఏమి!

మలయ—— (అనుబంధము 21.)

దేవీ! అర్జునుని భటులచే మేము మొత్తపడి-డీలుపడి-బెండువడి-యోటువడితిమి.

ప్రమీ——హా! శ్రీహరీ! వీర మతల్లులారా! నేఁడేల యిట్లయితిరి? యిది నావిధిబలము గాక మీశక్తిహీనతవలన నయినదికాదు. అయ్యో! ఎందఱెందఱు రాజన్యులు మీయెదుట నిలువఁజాలక శృంగభంగము నొందరైరి? అట్టి మిమ్ము నేఁడర్జునుఁ డొక్కఁడు గెలువఁజాలెఁగా!

(అనుబంధము 22.)

అయినను మఱొక చిన్నగాయమైనను గాంచక ఎట్లుపరాజితులైతిరి? యుద్ధక్రమ మంతయు నాకెఱింగింపుఁడు. వినుఁడుఁగాక.

మలయ——దేవీ! అర్జునభటులతోఁ బ్రద్యుమ్న, మేఘనాద, సాత్యకీ, నీలధ్వజ, సాంబాదులతో మాకు ఘోరసంకుల సంగ్రామమొదవె. మాబాణముల ప్రేట్లుదినియు

హానిభరియించియు, నెట్టిధీరులో మాకించుకైన నొప్పిగాకుండ పరాజయము కలిగించిరి. మేము విధిలేక కర్తవ్యములేక వెనుకవచ్చితిమి.

ప్రమీల—హా! హా! ఇంతటి ధీరత్వము నింత యశక్తపురుషగుణము మీకుండునని యొకనాఁడును నెఱుఁగనే? నాకుఁజెప్పిపంపక పోయితిరా? లేక చావనైనఁ జావరైతిరా? మిమ్ము స్త్రీలగుదురంచు నమ్మితిఁగాక, పురుషులఁబోలె నిట్లవుదురని తలంపనైతి. చారుమతీ! నీయాశయమే ఫలించె. కానిమ్ము. ఉండనిమ్ము. మంజరీ తెమ్ము నాధనుః ఖండములఁ. చేకొమ్ము నాబాణతురీణములఁ. చేయింపుము రథమాయితము. కమ్ము నీవు నాకుసారథివి.

(అనుబంధము 23.)

చారు—దేవీ! ఇవన్నియును నాయితముచేసి యెక్కడికిఁ బోవనెంచుట నే విన్నవింపవచ్చునా?

ప్రమీల—ఇప్పుడ పోయియా క్రూరాత్ములఁ జక్కాడి నుఱుమాడి పీచమడఁచి నేలకుఁ బెట్టి పీనుఁగుపెంటలగావించివచ్చెద. నాపగఁదీర్చెద.

చారు—వారికై అక్కడికేలపోవలయు? వారే యిక్కడికి వచ్చియున్నారు.

ప్రమీల—ఎందున్నారు? ఏలవచ్చియున్నారు?

చారు—అయ్యో! వారిసామర్థ్యమింతయంతని చెప్పవచ్చునా? అక్కడ మమ్మెల్లర జయించినది చాలక మముఁ దఱిమికొని యిక్కడికే వచ్చియున్నారు. సెలవయినఁ దోడ్తెచ్చెదము. మలయవతీ! నీవు పోయి వారిఁదోడికొనిరమ్ము.

మలయ—(పోయి భుజబద్ధులైయున్న ప్రద్యుమ్నాదులనెల్లఁ బిల్చుకొనివచ్చును).

అందఱు—(గొల్లున నవ్వుదురు.)

ప్రమీల—సఖులారా! నన్నిట్లు హాస్యము చేసెదరా?

చారు—అయ్యో! హాస్యమేటికి?

ప్రమీల—వీరిజయించి భుజబంధనములఁ గావించితెచ్చి యిట్లాడుట ననుగేలిసేయుట కాదా?

చారు—అయ్యో! నీకేమిభ్రాంతి? యేమిచ్చిన బంధనములు కావలిసి వారైకట్టుకొన్నవి.

ప్రమీల—వారేల కట్టుకొనిరి.

చారు—స్త్రీలతో యుద్ధముచేయవలయు నన్న సమసంగ్రామము ధర్మముకాదని వీరు చేతులకట్టుకొనియే చేయుస్వభావము. ధీరగుణము.

అందఱు—(నవ్వుదురు.)
ప్రమీల—వీరిలో నర్జునుఁడెవఁడు ?

చారు—ఆయర్జునుఁడు యుద్ధమునకు రాలేదు. తనప్రాణముపై వచ్చునంతపనికు పనితల పై విల్లెక్కు పెట్టఁడఁట. ఇది యాతనివ్రతమఁట.

ప్రమీ—ఎంతసేపు హాస్యమాడెదవే ?
చారు—నీయాన యీమాటమాత్రము నిక్కము,
మంజు—దేవీ ! యిది నిక్కము.
ప్రమీల—ఈ బాలుఁడెవఁడు ?
మంజు—కర్ణకుమారుఁడగు వృషకేతుఁడఁట.

ప్రమీల—(బంధనములు విచ్చి) వీనిని శ్లేలగట్టితిరే ? పాపఁడా ! రమ్మిందు. కూర్చుండుము.

వృష—(సిగ్గుతో నూరకుండును)

మలయ—దేవీ ! వీరినందఱి నిప్పుడు కారాగృహమున నుంచెదను. పిదప వీరియు దంతము వినిపించెదను.

(అని అందఱితో నిష్క్ర.)

ప్రమీల—ఇంక మనము పోవుదము.
అందఱు—(పోవఁబోవ)
ప్రమీల—చారుమతీ ! యిటురమ్ము, మీరుపొండు (చారుమతి ప్రమీలదప్ప నందఱు

(నిష్క్ర.)

ప్రమీల—చారుమతీ ! నీవర్జునుగూర్చి యన్నమాట నిక్కువమా ?
చారు—నీయానయని పల్కితిఁగదమ్మ ?

ప్రమీల—వాఁడెట్టి ధీరశేఖరుఁడో కదవే ? వానిఁజూచు కుతూహలమును వానితో సమరముసేయు కుతూహలమును నాకు మెండుగనుండె. ఇప్పుడది యెట్లు సిద్ధించు?

చారు—రాణీ ! ఇప్పుడు మనమిందఱి నిర్బంధమున నుంచియున్నారము కదా ? ముందతఁడే వచ్చునని తోఁచుచున్నది.

ప్రమీల — నాకట్లుతోఁపదు. ఊరినుండిభీమాదులగు తనవారిసైన రక్షించుకొనుఁగాక తానుయుద్ధమునకు రాఁడనితోఁచుచున్నది.

చారు—ఉండవచ్చును. ఇప్పుడు మన కా యోచనయేల ?

ప్రమీల—అటుగాదు, నేను వానిఁ జూడ నభిలషించియున్న దాన.

చారు—అయినమనమే యక్కడికిఁ బోవుదము.

ప్రమీల—ఎక్కడ ? ఎప్పుడు ? ఎట్లు ?

చారు—నాకొకటి తోఁచుచున్నది. ఇపుడుకారాగృహమునను న్న వారిలో మన యెడకునిన్న రాయబారిగావచ్చియుండిన సుయోగుఁడనువాఁడు మిగులనున్మత్తుఁడు. వానివలన నన్ని కార్యములు సాధింపవచ్చును.

ప్రమీల—ఏదైన నుపాయము చేయుము.

చారు—మంజువాణీ !

(ప్ర: మంజువాణి.)

ఇపుడుకారాగృహమునకుఁ బోవనున్న వారిలోసుయోగుఁ డనువాఁ డొకఁ డున్నాఁడు, రాయ్యమీసములవాఁడు, చూడుము, వానిఁదోడ్తెమ్ము.

(మంజువాణి నిష్క్ర)

ప్రమీల—వాని నిచ్చోటకే పిలిపించెదవా ?

చారు—అదే వచ్చు చున్న ట్లున్నది.

ప్రమీల—అయిన నేఁబోయెదను. (నిష్క్ర).

(ప్ర: సుయోగుఁడు.)




చారు—సుయోగా ! యిందురమ్ము.

సుయో—ఏలరావలయు ? అయ్యోధీరగుణా—

చారు—మరల మఱచెదవా నా పేరు ?

సుయో—ధీరమతియే యుండని. ధీరమతీ నన్నెంతచెఱచితివి? ఎంత అవమానమాయెను !

చారు—"చారుమతీ" యనుము. నిన్నేమిచేసితిని ? అంత నీకు బంధనములు లేక నాయట్టియువతి యాశ్లేషసుఖము లభించునా ?

సుయో—బంధనములుగాని యేమైనఁగాని. ఆశ్లేష మిప్పుడుమాత్రము లభించెనా ?

చారు—ఏల లభింపదు? నేను నీదానను గదా ?

సురయో—నీవు నాదానవే యయినఁ జరణములంటి వేఁడెదను. ఈవిన్నపము మాత్ర మొనరింపుమా. నేనర్జునుని యెదుట నేమేమో చెప్పుకొంటిని. నేనుజిక్కుటవలన నామాటలుకల్లలాయె. కావున నను ననుగ్రహించి నను విడిపింపుమా. నే నేసుఖమును గోరను. నీ వేకార్యముఁజేయుమన్నను జేయుదును.

చారు—సురయోగా! నాప్రియసురయోగా! నేను నీదాన నైయుండ నన్నింతడుగవలెనా? అవశ్యమొనరించెదను. నీవు మాత్రమర్జునునియొద్దనే యుండి వాఁడేమనునదియు నేమిచేయ నెంచునదియు నీరహస్యవృత్తాంతములు నాకుఁ దెలుపుచుండవలయు. ఇంతమాత్రము చేయుదువా?

(అనుబంధము 24.)

సురయో—మంచిమాటాయె. నన్ను గురుద్రోహివి కమ్మని చెప్పుచున్నావా? ఏమైన నొనరింతుఁగాక యిట్టికార్యముఁ జేయుదునా?

చారు—ఇదెట్లు గురుద్రోహము?

సురయో—అందఱిరహస్యములన్నియు మీకుఁజెప్పి, యేమఱుపాటొనరించుట గురుద్రోహముగాకింకేమి?

(అనుబంధము 25.)

చారు—(మెల్లఁగసురయోగుని చంపఁగొట్టి) భ్రాంతా! అట్టిపనియయిన నిను నియమింతునా? ఎన్నఁటికిని గలుగదు. నీతలముట్టిబాసచేసెదను. ఈహాయమును మరల నర్జునున కొప్పగింపవలయుననియే మారాణి యభిప్రాయము. ఆయమ యర్జుసునిఁ జూడఁగోరియున్నది. చూచినపిదప వారిరువురు నేమగుటయు నీవయెఱుఁగుదువు. అందలిరహస్యము తెలియఁగఁగోరుట వేడుకకుఁగాని యితరముకాదు.

సురయో—అటులనా? అట్లైన నవశ్యము చెప్పెదను. ఇంకొక్కమాట. నే నెప్పు డెట్లెవ్వరికిఁ జెప్పవలయు?

చారు—నీచెంత నుండునది యేమి?

సురయో—చారుమతీ! ఇది మాతాతలకాలమునాఁడు మాయింటనుండినరక్ష. దీనిచేత ధరించి దైవభజనముఁజేసిన సర్వాభీష్టములు సమకూరు. చూచితివా! యిప్పుడు నను నిర్బంధితుఁజేసినతోడనే దైవధ్యానముచేయసాగితి. వెంటనే నీకే యనుగ్రహము గలిగి విడిపింపయత్నించితివి.

చారు—దీనియందిట్టిమహిమగలదా! ఏదీ? (తోసికొని) ఈ యుంగరము నీయొద్దనుండ నిమ్ము. దీనిఁజూపిన నిను నెవ్వరు నడ్డముచేయరు. నీవు నిర్భయముగ నీయొడకు

వచ్చియుదంతయులన్నియు నెఱింగింపుచుండుము. నీ వీమాటజరుపుటకు త్తరవాదివి. నీరక్ష నాయొద్దనుంచుకొనియుండెద. భయపడకుము. నేనేమియు దీనిమ్రింగను. నీ వీపని నెఱవేర్చుటలో నించుకైని మోసముచేసితివా యీరక్ష నీకురాదు. యోచింపకుము.

సుయో — నే నంతయుఁజేసెదఁగాక రక్షమాత్రమిమ్మా.

చారు — రక్షయేమి ? పాదరక్ష. మనసొత్తు నీయొద్దనున్న నేమి నాయొద్దనున్న నేమి ? ఇంకఁబొమ్ము. ఏమియోచించెదవు ?

సుయో — ఏమియు లేదు. నాస్వాతంత్ర్యమునుగోరి నాప్రభువును మోసముచేయు నటుల నారక్ష రాఁదీసితివి. నీవలను నను దగులనేసితివి. ఇంతచేసియు మీదుపెట్టి యున్నావుగాని యొకకౌఁగిలియైన నొకముద్దైన నియ్యవైతివి.

చారు — ముద్దునకేమివచ్చెను. వలసినన్నికొనుము.

సుయో — (ఎగురులాడుచు) ఇప్పుడు ధన్యుఁడనైతి.

(ముద్దుపెట్టుకొనఁబోవును.)

(అనుబంధము 25.)

చారు — (చంపఁగొట్టి) ఇంతాతురమా ? పోదమురమ్ము. మాదేవి మాశిబిరమునకువచ్చి మాయర్జునునకుఁదెలియకుండ వానిఁజూడఁగోరియున్నది. అందుకుఁ దగినప్రయత్నములు చేయవలయు.

(నిష్క్ర.)

---

శ్రీ

# ప్రమీలార్జునీయము.

తృతీయాఙ్కము-తృతీయరంగము.

అర్జునుని శిబిరము.

[ప్ర: అర్జునుఁడు-సుయోగుఁడు.]

అర్జు—సుయోగా! మనవా రొక్కరున్ను లేరు.

సుయో—ఇంకెక్కడరాఁగలరు? అందఱును వైరి వనితల వలఁబడి వారియూడ నిర్బంధమున నున్నారు.

అర్జు—మేఘ వీర్లు?

సుయో—వైరికాంతా మారుతములు మేఘములనయినఁ గొనిపోవ వీర్లెక్కడనుండఁ గలరు?

అర్జు—నీలధ్వజుఁడు?

సుయో—మకరధ్వజుని బారికిఁజిక్కె.

అర్జు—ప్రద్యుమ్నుఁడు?

సుయో—వాఁడే మకరధ్వజుఁడు. వానియిల్లు వాఁడుచూచుకొనిరె.

అర్జు—సాత్యకి?

సుయో—ఆముసలివాని కొక్కవయసుపడుచుచిక్కె. ఇంకనేమికావలయు?

అర్జు—సాంబుఁడు?

సుయో—వానికొక యర్ధాంగిని గలిగె.

అర్జు—వృషకేతుఁడేమాయె?

సుయో—వాని కేగిరికన్య దొరికెనో నేఁజూడనైతి.

అర్జు—ఇంద ఱిట్లయిన నీవెట్లువచ్చితివి?

సుయో—వారందఱు సొగసుకాండ్రు. విటపురుషులు. చూచినమాత్రమున దగులమునఁ బడిపోయిరి. నన్నెవతె మోహించును ? నేనట్టివారి మోసములకుఁ జిక్కుదునా ?

అర్జు—సుయోగా ! నీవు వెలుపలనుండుము. పిదప మాటలాడుదము.

(సుయోగుఁడు నిష్క్ర.)

సీ॥ ఘనరీతి వహ్నికై ఖాండవం బర్పింప
నెంచినవేళ జింతించి యెఱుఁగ ।

హరునితో వనవరాహమునకై మార్కొనఁ
గాంచినవేళఁ జింతించి యెఱుఁగ ।

కాలకేయనివాత కవచాది దనుజుల
నొంచినవేళఁ జింతించి యెఱుఁగ ।

గోగ్రహణమునాఁడు కురుసేన దలకొని
మించినవేళఁ జింతించి యెఱుఁగ ।

తే॥ గీ॥ చండతరబాణవహ్ని సంశప్తకాళిఁ
జించిచెండాడువేళ జింతించియెఱుఁగ ।
నిప్పు డబలాసమూహంబు నెనసిపోరఁ ।
జింతకలిగెడునకటా సిగ్గుచేటు ॥

తలఁచుకొన్న నవ్వువచ్చుచున్నది. చెప్పుకొన్న సిగ్గగుచున్నది. ప్రతిజ్ఞఁబాయుదునా ? లేక పరాజయమున కొప్పికొందునా? పరాజయమున కొప్పికొన్న నెన్నియనర్థములుగలుగు ? మొట్టమొదట యజ్ఞమునిలుచుఁగదా ? దానికెట్లోర్చుకొందును ? ఏమిచేయుదును? హస్తిపురికి వ్రాసి భీమాదులను బిలిపించుకొందునా ? ఎంతాలస్యమగును ? ఆహా! ఇప్పు డొకటి తోఁచుచున్నది. అట్లుచేసిన నెట్లు? ధీరకృత్యము గాదు. మాయావులు చేయుపని. అయిననిట్టిచోట్ల మాయయే యొనర్పవలయు. ఎట్లయిన నిగూఢవృత్తిని బురముప్రవేశించి, హయమున్నచోటును, మావారున్నచోటునుజూచివచ్చి, సులభముగ వారును హయమును వెలిసేరుమార్గముఁజూచివచ్చెద. మోసమైన నొనరించి వారిని వెలికిఁదీసితినాయన్నికార్యములు సాధ్యములగును. ఆహయమును నా భటులను నాయొద్ద నుంచుకొనియెద. ప్రమీలాదులు యుద్ధమునకువచ్చిరా నే దండనుండి వారితో యుద్ధమాడించెద. మీఱివచ్చిన నేనే సమరముఁజేసెద. సుయోగా !

సుయో—(ఇంతవఱకుఁ బ్రక్కనసుండి ప్రమీలకు చారుమతికి నర్జునుఁజూపుచుండును.)

(ప్ర-సుయోగుఁడు.)

సుయో—దేవా! ఏమి సెలవు?

అర్జు—సుయోగా! నీవు రాయబారివై యీపురిఁజొచ్చియుంటికదా? పురివైపులనంత యుఁజక్కఁగాఁ జూచియున్నావా?

సుయో—అందందుఁ జూచియున్నాను, గాని యిప్పుడెందుకు?

అర్జు—సుయోగా! నే నూరు ప్రవేశింపవలసియున్నది.

సుయో—అయ్యో! ఇట్లేల? వారు గుఱుతించిన?

అర్జు—కాదు. గూఢవృత్తి వేషాంతరమునఁ బోయెద.

సుయో—పోయి—

అర్జు—పోయి హయమున్న సెలవును మనవారున్న చోటును జూచివచ్చి పిదప నొక కార్యముఁ జేయ నెంచి యున్నాను.

సుయో—ఏమి కార్యము?

అర్జు—అదంతయు నీకెందుకు? నీ వాచోట్లఁజూచి వచ్చియున్నావా? లేదా?

సుయో—కొంతకుఁ గొంతచూచియున్నాను.

అర్జు—అయిన నీ వేదేని వేషాంతరముఁ బరిగ్రహింపుము.

సుయో—నీ వేమి వేషము గైకొనెదవు?

అర్జు—అన్నియుఁ జెప్పుద నిటురమ్ము. (నిష్క్ర.)

(ప్రమీల చారుమతి ముందఱికి రాఁగా),

చారు—రాణీ! చూచితివా, యీవీరుని?

ప్రమీల— అనుబంధము. 26.

ఆహా! చారుమతీ యీవీరుఁ డతిలోక సుందరుఁడే. విగతకళంకుఁడగు నేణాంకుఁడు. సారంగభూషణుఁడగు మీనాంకుఁడు. ఈవీరుని ననంగక్రీడలఁ దేలింప లేని తరుణి యౌవన భాగ్య మెందుకు?

చారు—అమ్మా! మనమింటికిఁబోయి మాటలాడుకొందము. ఇందుండిన నపాయము.

ప్రమీల—చారుమతీ! యిందుండుట యుపాయము. ఆ మోహనాంగుఁడు మరల నిందువచ్చె నేని వానిచరణములపైఁబడి వేఁడికొని నాప్రాణము లతనిశృంగారమున కుపాయనముగా నర్పించెద.

చారు—దేవీ! అదిలగ్గుగాదు. అది యుత్తమమునుగాదు. దీనికి నేదేని యుపాయముఁ జూపెద రమ్మ.

[పునః ప్ర: సుయోగుఁడు-ప్రక్కన.]

సుయో—(చారుమతిని సైగఁజేసి పిలుచును.)

చారు—ఆ భ్రాంతుఁడేమో పిలుచుచున్నాఁడు. నేఁబోయి యిప్పుడేవచ్చెద. (పోయి సుయోగునిఁజూచును.)

సుయో—(చారుమతితో రహస్యము మాటలాడును.)

చారు—(ప్రమీలయొద్దకువచ్చి) దేవీ! నే నొక్క వినోదము వింటిని. అర్జునుఁడు నీకుఁ జిక్కుటకు నుపాయమొదవె. పోదమురమ్ము. (నిష్క్ర.)



శ్రీ

# ప్రమీలార్జునీయము.

## చతుర్థాంకము-ప్రథమరంగము.

### కారాగృహము.

[ప్ర: మేఘనాథుఁడు-సాత్యకి-సాంబుఁడు-నీలధ్వజుఁడు-ప్రద్యుమ్నుఁడు-సారణుఁడు-వృషకేతుఁడు.]

అందఱు:— (అనుబంధము 27-28.)

మేఘ:—అయ్యో! ఇట్టి పలంగాకిచేడియలచేతఁ జిక్కి యింత వందరు చున్నామే! యిట్టిదుస్థితికలదా? యిక్కడనుండి వెలిఁజేరుమార్గము కలదా? మలయవతీ! నీవెట్టి ప్రళయవతివి! నీ విప్పుడు నాకండ్లఁ బడితివేని నినుఁజించి చెండాడి నీ మాంసము కాకములకు విందొనర్పనా?

సాత్యకి:—హా! నాదౌర్భాగ్యమే మనవలయు! ఎంత జితేంద్రియుఁ డనిపించుకొంటిని! ఎట్టిశుద్ధుఁడనై యుంటిని! అయ్యో! మాలతియని గలిగినపేరున నెంత సారభముగలదియోయని కానఁనేరక యిట్లు జేలనైతి. అక్కటా! ఆమాలతి మాలదియాయెనే! ఇట్టిచండాలినికి నేనేలగోలంపడితి?

ప్రద్యు:—అయ్యో! కనకలతా! నీవులతవా? నమ్మినవారి గొంతుకోయు కరగసమవు. అట్టినినునమ్మి మోసపోయిన నన్నే యనుకొనవలయుఁ గాక నిన్నని ప్రయోజనమేమి? నీ విప్పుడు మాత్రము వచ్చితివా నాకసియంతయుఁ దీఱ నినునింతింతగాఁ గడికండలు సేయుదునే!

నీలధ్వ:—మంజువాణియను పేరు పెట్టుకొని నన్నీగతికిఁదెచ్చెఁగా! అది మంజువాణి యయిన నగుఁగాని హాలాహల హృదయయగుట యెఱుఁగనైతి. అదిమాత్రము నాకుఁ గన్పట్టినా యదిమంజువాణి యగుటయు నిర్వాణియగుటయుఁ జూపించెద.

వృష:—అయ్యలారా! మీరందఱును మంజువాణి గార్దభవాణి యని భ్రమఁజెంది యిట్లయితిరి. నేనే పాపము నెఱుఁగనే? నాకేల యీగతికలిగె?

మేఘ—శూరులారా! మనమూరక యిట్లు నిర్వాణదీపమునకుఁ దైలముపోసినట్లు మాటలాడుచుండిన నేమిప్రయోజనము? ముందుసేయఁదగినకార్యమును యోచింపుఁడు.

సీ॥ దుర్వారలయకాల శర్వాధికాభీల
గర్వాతిరేకంబు గాంచవలదె।

శంకారవాతిధీహుంకారబహుళతా
హంకారపటిమ యిం తడరవలదె

నిర్నిద్రకల్పాంతఘూర్ణమానకృతాంత
పూర్ణరోషం బింత పూనవలదె।

శక్రారివిలయకృచ్ఛక్రాయుధామంద
విక్రమక్రమ మింత వెలయవలదె।

తే॥ గీ॥ తడయ కీచెఱఁగూలంగ దన్నవలదె।
యీనిరోధంబు నెట్లైన మానవలదె।
కవిసి యీపురి నీరుగాఁ గాల్పవలదె।
చేడియలనెల్లఁ జంచి చెం డాడవలదె।




ప్రద్యు—మనమందఱ మెట్లయిన నీనిర్బంధమునుండి వదలించుకొని మమ్మీగతికిఁ దెచ్చిన-యీవిధవలుగలరే-వారిఁదుండ్లుతుండ్లుగా నఱుకాడువఱకు నాకూఱట గలుగదు.

సాత్యకి—అదినిశ్చయమే. అయిన మనము తప్పించుకొనుట కొకమార్గము వెదకుదము.

మేఘ—ఈ వాకిలి నిట్టులేకాలఁదన్ని పగులఁగొట్టుదము. ఈయింటి నిట్లే కూలఁదన్ను.

సాంబు—అట్లయిన నీయింటితోఁగూడ మనమును కృష్ణార్పణమయ్యెదము.

సాత్య—ఏమయిననుగాని.

(దూరమున ప్ర: కనకలత-మొదలగుస్త్రీలు.)

మేఘ—అదిగో! స్త్రీలు నడచినచప్పుడు వినిపించుచున్నది. ఇక్కడికి వారువత్తురేమో.

ప్రద్యు—వారుమాత్రమువచ్చిరా యీకాడలుపీకి వైచి పోయి నలుకాడెదను.

కనక—ఎవరినినలుకాడెదవు? శూరవర్యా!

ప్రద్యు—అలివేణీ! నీవె వచ్చితివా? నాపాలిభాగ్యదేవతవు!

కనక—నలుకాడునది యెవరిని?

మేఘు—నిన్ను నీయక్కను దానియక్కను రంపెతలారా! మమ్మెల్లర మోసపుచ్చి హాస్యమాడుటకు వచ్చితిరా?

ప్రద్యు—మేఘనాథా! నాప్రియ సతీమణి నట్లాడిన నీనాలుకనిప్పుడ గోయుదును.

మేఘు—నీప్రియసతీమణి తలగోటిగిరి. ఈముండ లెల్లరు మమ్ము నన్యాయముగఁ బరిభవించి నందుకు రిధ్వంసముచేయవలయు.

మలయ—(ముందరికి వచ్చి) ఎవరిని ధ్వంసముచేయుదువు?

మేఘు—దేవీ! నీవె వచ్చితివా? నమస్కరించెదను.

మలయ—అదియుండినీ! నీవు ధ్వంస మెవ్వరిఁజేసెదవు?

మేఘు—నీవు నాదండలేనప్పుడు నన్నింత బాధచేసెడు కరుణాగుణదూరుని, క్రూరుని, మారుని.

ప్రద్యు—నన్నేల యిట్లనెదవు? నీకర్మగతికి మారుఁ డేమిచేసెను? కనకలతా దాసుఁడవై దానిచింత దప్ప నన్యమెఱుఁగకున్న, మారుఁడు నీకేమొనర్చెను?

సాత్యకి—చాలును లెమ్ము. మీరందఱు నిట్లు భ్రాంతులై మీమీ తరుణుల ప్రశంసించుచువారి యడుగులకు మడుగులొత్తుచు నిట్లుండ మాగతి యేమికావలయు? మిమ్ము నుండియేకదా నాకీతగులాటవినది?

మాలతి—సాత్యకీ! ఎవరినుండి?

సాత్య—నీవా! చూడుము. నీపాదనఖరములనయిన విలువఁజాలని యీయంగనల నీభ్రాంతులెట్లు ప్రశంసించుచున్నారు. కనకలతయఁట. మలయవతియఁట. నీ యింటఁ గసవూడ్చుచుండ నైనఁ దగుదురా?

మంజు—ఎవరు తగరు?

నీల—ఊరకుండుఁడు. మీమాటలు మీవి గాని నాముద్దులమంజువాణి మాటలవినరే?

మేఘనాథేత్యాదులు—అయ్యో ! మమ్ము నేమిచేసి పోయెదరు?

తరుణీమలయవతీ-కలికీకనకలతా-పొలఁతీమాలతీ.

మలయ—ఏలయిట్లు తీవ్రపడెదరు.

అందఱు—అయ్యో ! తీవరమా ! అయ్యో ! సౌఖ్యమా !

మలయ—దుఃఖముపిదపఁ గలిగిన సౌఖ్యము గదా రుచించును ? మీరువిచారింపకుఁడు.

(స్త్రీలు నిష్క్ర.)

మేఘ—మలయవతీ! (అని ప్రద్యుమ్నుని కౌఁగిలించును.)

సాత్య—మాలతీ ! (అని మేఘనాథుపైఁబడును.)

నీలధ్వ—మంజువాణీ ! (అని సాత్యకి నీడ్చును.)

ప్రద్యు—ఇందఱు కనకలతలా నాకు? (అని క్రిందఁబడును.)

(యవనికపడును.)




---

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## చతుర్థాంకము-ద్వితీయరంగము.

### వీధి.

[ప్ర: అర్జునుఁడు (సన్న్యాసియై)-సుయోగుఁడు-(ఫకీరువేషమున.)]

(అనుబంధము 29.)

అర్జు—సుయోగా! నే నెట్లున్నాఁడను?

సుయో—నేనో?

అర్జు—నీ వెట్లుండిన నేమి?

సుయో—నీ వెట్లుండి నేమి? నేనుగదా ముఖ్యము.

అర్జు—అదియెట్లు?

సుయో—ఈపురిలో ని న్నొక్కరును జూచినవారులేరు. రాయబారివై వచ్చియుండి నందునను నన్నందఱు గుఱుతింతురు. కావున నేగుఱుతింపఁ బడకుండుటయే ముఖ్యము.

అర్జు—సుయోగా! ఎట్లున్న దీపురవైభవము! ఈసుధాసౌధములు వజ్రముల మేడలవలె నున్నవి. ఈవీధు లెంతశృంగారములుగనున్నవి! ఈకాంతలందఱు నెంతరమణీయముగ నున్నారు! ఎవ్వరుచూచినను నమూల్యభూషణముల ధరించియున్నారు. ఇందలివారు దారిద్ర్యము నెఱుఁగరు కాఁబోలు. పేదలు కలుగరుకాఁబోలు. నారీశృంగారరసము నంతయు విధాతృఁడు గ్రహించి యెందునుడివోవని తెలివికలిమి నీపట్టణపు సుందరుల సృష్టి సేసెఁగాఁబోలు.

సుయో—(మెల్లఁగా) ఇప్పుడే యిట్లనుచున్నాఁడు. ఇంకముందేమి కాఁగలదో?

అర్జు—సుయోగా యేమంటివి?

సుయో—ఏమియు లేదు, దారితప్పితిమంటిని.

అర్జు—దారి యెట్లు తప్పితిమి?

సుయో—ఈపాడుపట్టణమున వీధులన్నియు వీధులలోని యిండ్లన్నియు నొక్కతీరుగ నే యున్నవి. ఇదికాదుమార్గము.

7/8

అర్జు—మనవారున్న నిర్బంధగృహమునకు నిదిదారిగాదా?

సుయో—ఆగృహమును నేఁ జూడలేదు. ఏమోపోవుచుండిన నిక్లేచిక్కునని వచ్చితిమి-దారి తప్పితిమి-ఇంకేమిగతి?

## (అనుబంధము 29.)

అర్జు—ఓరీ! యవివేకీ! నిన్నునమ్మివచ్చుట దున్నపోతుతోఁకఁ బట్టి యేఱుదాఁట నుద్యమించినట్టు లాయెఁగదా?

సుయో—నను దూఱకుము. ఎవ్వఁడెఱుఁగు నీపాడుదారు లన్నియు? నేనావైపునఁ బోయివిచారించి వత్తును. నీవిందైననుండుము. లేకున్న నెవ్వరినైన నడుగుము. (నిష్క్ర 1.)

అర్జు—ఈమూఢుఁడిట్లాయెను. వీని నమ్మి నే వచ్చినందుకు నాకు బాగాయెను. ఎవ్వరినైన నేనేమియడుగుదును? అడిగిన నన్ను సంశయింపరా?

## (ప్ర: మలయవతి.)

మలయ—(స్వ) ఓహో! ఇతఁడే యున్నట్లున్నది. (ప్ర) మునీంద్రానమస్కృతులు (అని నమస్కరించిలేచి) పావనులరగు మీ రీపురికి విచ్చేయుట నీ పురివారి భాగ్యముఫలించెను. మీ శుభసందర్శనము నాకబ్బుటచే నాజన్మము పవిత్రమాయెను. ఎందును రాక వచ్చి యున్నవారే నే నొసంగు నాతిథ్యము స్వీకరించి నాయిలు పవిత్రము చేసివిచ్చేయవలెనని విన్నవించు దానను. అదియే నాభవనము. వేంచేయుఁడు.

అర్జు—యువతీ! నీయాదరణమగణ్యము. నీవిచ్చునాతిథ్యమంతయు నాకుముట్టె. ఒక్కసీమ నిలువక నెల్ల సీమల హాయము పోయినట్టు పోవుచు నిపుడు సర్వాశలుమాని యున్నమే మొక్కయెడ నిలుచువారము కాము. ముందు పోయెదము.

మలయ—మునివతంసమా! నాయాదరణమును గణించి నన్నునాదరణ మొనరించుట పాడియా? కొన్నివత్సరములనుండి నాకుఁగుక్షిశూలగలదు. రెండేండ్లక్రిందట నొక యోగి వచ్చియుండి 'యింకఁగొన్ని దినములలో నొక్కపరమమునీంద్రుఁడు నీకు సందర్శనమిచ్చును. అతని దర్శించుకొని యతని పాదతీర్థము సేవించితి వేని నీకు నిరామయత గలుగు' నని యానతిచ్చెను. అతఁ డాడిన మునిచంద్రుఁడు నీవ కానోపుదువు. కాకున్న నహోరాత్రములు నెడగానకయుండిన నాశూల యిప్పుడు మిముదర్శించిన మాత్ర నేనిలుచునా? ఇంక మీపాదతీర్థమున కనుగ్రహింపవలయు.

అర్జు—రమణీ! నీయుపచార వాక్యములకుఁ గడుమెచ్చితి. నాపాదతీర్థము నిన్నరోగినిఁ గఁ జేయఁజాలిన దాని నీనందునా ? అవశ్యము కానిమ్ము.

మలయ—ఇదె నాభవనమునకే వచ్చితిమి. ఇందుఁగూర్చుండుఁడు. (పీఠము వేసి కూర్చుండఁబెట్టును.) మునివర్యా! ఇదెపూజాద్రవ్యములఁదెచ్చెద.

(నిష్క్ర.)

(అనుబంధము 30.)

అర్జు—(స్వ) దైవానుగ్రహము నాపైఁగలుగుచున్నట్లున్నది, యిది నాయెడ భక్తిగలది గానున్నది. అనుయోగ గర్దభుఁడు పోయినను నిదినాకు లభించె. దీనిమూలమున మనవారిఁ జూచుభంగి గలిగించుకొందును.

(పునః ప్ర: మలయవతి పూజాద్రవ్యములతో.)

మలయ—(స్వ) మారాణికై నేను మన్మథపూజ సేయుచందమున నీమార సుందరుని, నీమన్మథ మన్మథునిఁ బూజ నేనిప్పుడ చేసెదను. (అర్జునునిఁబూజించి) మునీంద్రా! యింకఁదీర్థమీవలయు.

అర్జు—(ఇచ్చును.)

మలయ—(తీసికొని) మునివతంసమా !

ఉ॥ దిక్కులదిక్కులన్ బహుళతేజమునించుచు నాశ్రితాళిపై ।
నక్కటికంబువెంచుచు దయాగుణ భాసురతంజెలంగు నీ ।
వెక్కడివాఁడ వేమికత మిక్కడరా నభిదానమేమి నేఁ ।
డెక్కడనుండియెక్కడికి నేగెదవో మునివంశచంద్రమా ॥

అర్జు—తరుణీ ! నాదేశము కడుదూరము. నే నిప్పటి యతినిగాను, గత్యంతరములేక యీవర్తనమాచరించితిని. మావారెందఱున్నను నాకు లేరైరి. దైవగతివలన నాకును నిర్బంధము గలిగె,వారికిని గలిగె. ఊరక యుద్దేశములేక యిటుతిరుగాడు చున్నాఁడను. ఇంద్రలోకమునను నాప్రవేశమునకు నిరాటంకము. ఆ యింద్రుఁడు ననుఁ గడుగారవమునఁ జూచును. అట్టివాఁడ నిట్లైతిని.

తే॥ గీ॥ తరుణియీపురివెలుపల నరసిచూడఁ ।
గదనరంగవిధానంబు గానఁబడియెఁ।
బట్టణంబుననొకసంభ్రమంబులేదు ।
వెరఁగుజనియించె నిం దెట్టి వింతకలవొ ॥

మలయ—(స్వ) మంచిమోసగాఁడు. ఇట్లులేకున్న నిట్టిరూపమున సుభద్రను బడయుచుండెనా? (ప్ర) స్వామీ !

సీ॥ కరిపురిధర్మజుం డరుదారహయమేధ
యాగంబొనర్పంగ హయమువిడిచె।
వెనువెంటనాతనియనుజన్ముఁ డర్జునుం
డటమహాహంకారపటిమవెలయ।
నరుదెంచెమావీటఁ దురగంబుతిరుగ మా
వారలచే నది పట్టువడియె।
కర్ణసూనుఁడుమేఘపర్ణనీలధ్వజుల్
ప్రద్యుమ్నసాత్యకిప్రముఖయోధు॥

తే॥ గీ॥ లడరియదికారణంబుగా ననికినిలిచి।
భుజబలములేక మాచేత విజితులైరి।
వారిమావారుచెఱనుంచి నారునేఁడు।
ఇదియెమాచరితంబుయతీంద్రవింటె॥

అర్జు—అర్జునుఁడును బరాజితుఁడాయెనా?
మలయ—అతఁడు యుద్ధమాడఁడఁట. ఆడిన నేమగు చుండునో.
అర్జు—అయిన వాఁడెందున్నాఁడు?
మలయ—ఈస్థలమున నేయున్నాఁడు.
అర్జు—(భయమున) ఎక్కడ?
మలయ—అందున్న యీశిబిరమునందు.

అర్జు—అయిన నిందున్నవారు బహుపరాక్రమాంచితులనుటకు సందేహమేమి? కావున నేనే యీపురిఁజూడవచ్చితి. ఈవిషయమునంతయు నీవచెప్పితివిగావున నిన్నడిగెదను. నీమాటలపై నాకురెండుకోరికలు కలిగినవి. ఆధర్మజుఁ డధ్వరమునకైవిడిచిన పృథివియొక్కటియే యుండునదియఁట. అది భద్రావతీపురమున యౌవనాశ్వరక్షితమై యుండ దాని ధర్మజుఁడు సాధించెనఁట. దానిఁజూడవలయునని నాకభిలాషము. అదిగాక, వృషకేతునితండ్రి కర్ణుఁడుండెఁగదా వానికి నాకు యావజ్జీవ వైరముగానుండెను. ఆవృషకేతుని మీరు చెఱలో నునిచియున్నారు. కడుసంతసమైనకార్యము. ఆ చెఱలోనున్నవానిని నే నట్లుచూడవలయునని గోరుచున్నాను. ఈరెండును నీకుసాధ్యమాయెనా సంతసించెదను. కాకున్న నాదారిఁబోయెదను. అంతకును నీకుదేహమున స్వాస్థ్యము కలిగినదే పదివేలు.

మలయ—(స్వ) ఔరా! మంచిమోసగాఁడు. ఎట్లుమాటలాడుచున్నాఁడు. (ప్ర) స్వామీ! నీయభీష్టములు రెండును నెఱవేర్చు స్వాతంత్ర్యము నాకుఁగలదు. నీ హయమును జూపఁగలను. మీవృషకేతునిఁ జూపఁగలను.

అర్జు—నాహయ మేమిటిది?

మలయ—మీహయమంటి నేమోగదా? క్షమింపుఁడు. మీరు చూడఁగోరిన హయము. ఆమార్గమున నటుపోదమురండు. (నిష్క్ర.)

---

శ్రీ

# ప్రమీలార్జునీయము.

చతుర్థాంకము-తృతీయరంగము.

ప్రమీలనగరు.

[ప్ర: ప్రమీల (మంచముపైఁబవ్వళింప ప్రక్కనఁగనకలతా కాదంబినీ మంజువాణీమాలతులు-ఉపచారములు సేయుదురు.]

ప్రమీల—సఖులారా! ఈతాపము నే సహింపను. అయ్యో! నే భరింపఁజాల. ఆరూప

(అనుబంధము 31.)

జితమారు, బలజితసమీరు, నాచారుమోహనాకారుఁ గూడని నాజన్మమేటికి? తరుణీ! కనకలతా! ఆయర్జునుఁజూడ నాకభిలాష యేలకలిగె? కలిగెఁ బో యీ చారుమతి నన్నేలవలదనక గొనిపోయె? పోయి వానినేలచూచితి? చూచియిట్లేల మరుబారిఁబడితి? అకటా! నే జీవింపఁజాల.

(అనుబంధము 32.)

కనక—దేవీ! ప్రమీలా! నిమ్మళింపుము. ఈకార్యసాధనము సమకూర్ప నేఁగలను. చింతింపకుము. ఆయర్జునుఁడుమాత్రము నినుఁజూచెనా వరింపకుండఁడు. శీఘ్రకాలముననే నీయభీష్టములన్నియు నెఱవేఱఁగలవు.

ప్రమీల—కనకలతా! నాయభీష్టమెట్లు నెఱవేఱును? ఆయనంగ సుందరుఁడు నన్నిచ్ఛయించునా? ఇచ్ఛయింపనినాఁడు నేజీవింపఁగలనా?

మాలతి—

(అనుబంధము 33.)

దేవీ! నీవిప్పుడేల యుమ్మలించెదవు? అవశ్యము నిన్నానరుఁ డనంగక్రీడలఁ దేలింపఁగలఁడు.



ప్రమీల—మాలతీ! అయ్యో! ప్రియసఖివైనందున నీ వీయూరడింపుమాటలఁ జెప్పఁదగినదే, కాని నాకించు కంతయినను నెమ్మదిగలుగదు. సఖులారా! నాకిదియే యంతమని యెఱుఁగుఁడు. ఇంక నాఋణము మీకులేదు.

మంజు— (అనుబంధము 34.)

దేవీ! నీవేల యి ట్లలఁతఁ జెందెదవు? మలయవతిపోయి వేళయయినది. అది సాధించుకొనకరాదు. అనితప్పక నరుని నిందుఁ బిలుచుకొనిరాఁగలదు.

ప్రమీల—సఖీమతల్లులారా! ఆయర్జునుఁడో డ్డెచ్చినఁ దేవచ్చుఁగాక, వాఁడు నామనవిఁ గైకొను నను టెట్టిమాట?

కనక—అమ్మా! ఏల నీసౌందర్యమును నీవకొఱవల్కెదవు? ఆనరుఁడుగాఁడు, నరుని యబ్బదేవేంద్రుఁడేయైన నేమి? నిన్నించుక తిలకించెనా యచ్చెరువంది కనులఁగప్పి కొని ప్రార్థించి కాళ్ళఁబడి దీనుఁడై నీకుదాసుఁడై లోఁబడకుండునా? ఎందఱు రాజాధిరాజులు నీకామెతలిచ్చి నిన్నాశింపరైరి? నీయట్టి కాంతావతంసము లభింప వలెనన్న నాయర్జునుతల్లి వానిమంచివేళఁ గని యుండవలయుఁగదా?

(అనుబంధము: 35.)

ప్ర: మలయవతి.

మలయ—దేవీ! ఆ యర్జునుఁ దోడ్తెచ్చియున్నాను. ఇందే తెలుపట నిలిపియున్నాను.

కనక, మాల, మంజు—పిలుచుకొనివచ్చి దేవికి సందర్శింపుము. మేము పోయెదము.

ప్రమీల—మీరేలపోయెదరే? ఇందే యుండుఁడు.

కనక, మాల, మంజు—మంచికార్యము. మేము పోవములెమ్ము. ఆయర్జును నింత చూచి మరలి వత్తుము. (నిష్క్రా.)

[మలయవతిపోయి యర్జునునిఁ బిలుచుకొనివచ్చి.]

మలయ—ఆ కారాగారము తాళముచేతులఁ దెచ్చెదను. నే వచ్చువఱకు, మునీంద్రా! యిందేయుండుఁడు. (నిష్క్రా.)

అర్జు—ఈపురమునందలి హర్మ్యములఁజూడ నే మానందము జనించుచున్నది? నన్ను మలయవతి యిట్టి నెలరామేడ కేల కొనివచ్చె? చెలిసాలయు నీయూరనిట్టిదియె కాఁబోలు? దీనినెంత వర్ణించినను దక్కువయయగు.

ఏమిది! ఇంతసేపయ్యు మలయవతి యింకనురాలేదు! దాని కం దే మంతరాయ ముగలిగెనో. నీ వెంత యపాయకృత్య మొనరింప నుద్యమించితి? నన్నెవ్వరైన గుఱుతించి రా తలవంపు లౌఁగదా? ఎట్లు గుఱుతింపఁగలరు! నాయాకారమే వీ రెవ్వరునుజూడలేదే? ఆహా! మోసకృత్య మదెంత నిరుపాధికమైనదైనను, జేయ వలయునన్న భయము గలుగుఁగదా! అప్పుడే యఱగడియమాఱె. ఇందొంటిగానుండ కొలఁదివేసటగలుగుచున్నది. ఈహర్మ్య మెట్లున్నదో దీనినైన, బరీక్షించి చూచెదఁ గాక. (తిరిగి వెదకి పండుకొనియున్న ప్రమీల నుజూచి భీతినభినయించి వెనుకకు జరిగి) ఇందెవ్వరీవనిత యిట్లుపండుకొని యున్నది? ఆహా! ప్రణయవశమునఁ బతి నిఁబాసిజగమునకుందిగి కోపమువగలునఁబండియుండు మృగాంకభామినియో, నలకూబరు వెదకికొని వచ్చి కానకవిసుకు జనింప నూరక శయనించియున్న విభూషావిశేషాలంకృత రంభాప్సరసయో, కాదేని తనపతి నంగ భూషితుఁజేయు తలంపున శయనతపంబునహఠయోగ మవలంబించియున్న రతీసతియో యగుఁగదా!

(అనుబంధము 37.)

ఆహా! ఈసతియేయుండు నా ప్రమీల! ఆమలయవతినిఁ జూచినప్పుడే భ్రమసి యుంటి. ఇదియన్న దిగ్భ్రమముగలిగించుచున్నది. ఈయూర నిట్టితరుణులుండుట నే గదా ప్రద్యుమ్నాదులు నిర్విణ్ణులై వారిచేఁ జిక్కిరి. ఆహా! ధర్మజుఁడు బద్ధాధ్వరకంకణుఁడై నియతుఁడైయుండ, నట్టినియమము నుపాసించి హయసంగతి వచ్చియున్న నేనిట్టి నియమభంగమునకుఁ బాల్పడుదునా? యీ బెడదనాకేటికి? (ఊరకుండి) ఆహా! శుద్ధమానసమునందెంత యపేక్షకలిగినను మది యించుక యీడ్చుచున్నది. తుదకు నీతరుణీమణి వచోవైఖరినైనను వినఁగోరుచున్నాఁడ. దీనినుద్బోధించి సంభాషించినంతనే యేమితప్పు? పలుకరించెదఁగాక! (సమీపించి వెనుకకు వచ్చి) ఇది దురాగతమగు. ఇట్లొనరించుటొప్పదు. అయ్యో! ఆమలయవతి యెంతాలస్యముఁజేసె?

ప్రమీ — (నిదురనుండి లేచినట్టులేచి) మహాత్మా! నాపాలిదైవమువలె నన్ను గ్రహింపనేతెంచిన నీవెవ్వరవు?

అర్జున — రమణీ! అడుగడుగునకు సర్వసంగపరిత్యాగముచేయుచు మనసువచ్చినరీతిఁ దిరుగాడుచున్న వ్యర్థకర్మందిని.

ప్రమీ — యతీంద్రా! తమ్ముఁదాము తుచ్ఛముచేసుకొని మాటలాడుట పూజనీయులగు యార్యులకు నైజగుణము. ఇందులకేలవచ్చితిరి? నను ధన్యఁజేయఁగదా యిందు విచ్చేయుట?

ఆ॥ వె॥ పరులమేలుచూపి పలుమాఱు పొగడుట
చెలఁగితమ్ము నింతచేసికొనుట
కరుణనాశ్రితాళి నరసిరక్షించుట
జగతినైజగుణము సజ్జనులకు॥

ఈపీఠము నలంకరింపుఁడు.

అర్జున—కూర్చుండి, జగన్మోహన శృంగారమలరార మాయట్టి సన్న్యాసుల కర్ణముల కైనను విందుగలుగఁ దేనెలొలుకు ముద్దుపలుకులుపలుకుచు మదనసామ్రాజ్యమునకుఁ బట్టముగట్టిన వైభవదేవతవోలె సొంపుగులుకుచున్న నీవెవరవు? ఈస్త్రీమండలము నేలుభాగ్యముగన్న యాప్రమీలవా నీవు?

ప్రమీ—దేవా! యేనెవ్వరగుటయు వెనుకనుండివిన్నవింతు. నేనొసంగుపూజఁగాంచి నాకు ధన్యత నొదవించవలయు. పిదప నేఁజేయుప్రార్థన మన్నింపవలయు.

అర్జు—కామినీ! నీమాటలెట్టి తేనెలతేఁటలు! నీవెవ్వ రింత చెప్పరాదా?

ప్రమీ—(స్వ) నాయునికి నిజస్థితిఁదెలియఁజేసిన నెట్లుండునో? అయినను నొకభంగిఁ జూచెదఁగాక. (ప్ర) దేవా! ఏ నా ప్రమీలాసతి నేలు సుభద్రయనుదాసిని. ఆమె న న్ననవరతము తనయట్టిదానిఁగాఁ గూరిమిచూపుచు నేలుకొనుచుండును.

అర్జు—ఆహా! నీ వాప్రమీలదాసివా? ఏమివైభవమామెది! అతివా! నీవామలయవతియను కాంతనెఱుఁగుదువా?

ప్రమీ—అది నాకూర్చుసఖి.

అర్జు—ఆబిడ యెందున్నది?

ప్రమీ—నే నెట్లెఱుఁగుదును?

అర్జు—ఇదేమివచ్చెనునాకు? ఇంతసే పిట్లుండుదు?

ప్రమీ—దేవా? పూజనీయులగు భవాదృశులు నమ్మినవారిఁ గరుణించు సువ్రతముగల వారుకదా? మీ రనుగ్రహించిన నాయభీష్టము విన్నవించెద.

అర్జు—రమణీ! నీయభీష్ట మదియేమి?

ప్రమీ—మునివతంసమా! ఈయూర నారులు స్వైరిణులగుట విదితవిషయముగదా? కావున నేనెవ్వరికి భీతిల్లవలయు? నినుఁజూచినప్పటినుండియు నామది నినుఁబాయ దయ్యె. మారుఁడు క్రూరుఁడై లతాంత నారాచముల నూతి సానవెట్టసాగె. నీయనంగ సుఖము నభిలషించిన నాపై దయారసము ప్రసరింపఁజేసి నాయభీష్టము చెల్లించవలయు నని ప్రార్థించుదానను.

(అనుబంధము 38.)

అర్జు—రమణీ! ఇదియేమి నీకోరిక! యతులను మమ్ముఁ గాంక్షింపఁదగునా?

(అనుబంధము 38.)

మేము సర్వసంగములమాని మనఃపీఠిని నిట్టివిషయములఁ జొరనీకుండ విసర్జించి యున్నారము. అట్టి మమ్ము నీవపేక్షించుట వీతిఁడితనము. ఈయభిలాషము మానుము.

ప్రమీ—కరుణాకరా! సర్వసంగపరిత్యాగులమని చెప్పికొనుచు నిట్టినిష్కారుణ్యము మది బూనఁబాడియా? ఒక నిమేషమాత్రము నమ్మి తత్పరయైయున్నదాని కాంక్షించిన యభిలాషము నెఱవేర్చినంతనే నీ నియమములన్నియు వ్యర్థములగునా?

అర్జు—తెలివా! నీకు వివేకముచాలదు. నియమములాచరించి సిద్ధిఁబడయవలయునన్నఁ జిరకాలము పట్టుఁగాని, యాసిద్ధినీకగుటకు నిమేషమేల క్షణమైనను బట్టదు. ఊరక తీఱనికోరికలఁగోరకుము.

ప్రమీ—యతీంద్రా! మహామహుఁడగు నర్జునుఁడు సన్యాసియైసుభద్రను బరిగ్రహింపఁడా? నీవేల నన్నిట్లలఁతిఁజేసెదు?

అర్జు—కైతవ సన్యాసుల విషయమేల చెప్పెదవు? నే నట్టివాఁడనని యెంచితివా?

ప్రమీ—ఎట్టివాఁడవోకాని యా సుభద్రయింటనున్న యర్జునుఁడు యింతమురిపెములు గాటిముద్దులు మీఱియుండె నని వచింపఁజాల.

అర్జు—(స్వ) ఇదియేమి సమీపమునకేవచ్చుచున్నది! (ప్ర) తరుణీ! యిట్లాడుట నీకు మేలుగాదు. వాఁడట్లేలచేసెనో యా యర్జునునడుగు పొమ్ము.

ప్రమీల—కైతవ సన్యాసియగు నర్జును సుభద్రవేఁడిన చందమున నేనిను వేఁడుచున్న దానఁగదా? వానికిఁ గలిగిన కరుణ నీకేల గలుగదు? నేను బ్రమీలదాసినంటినే నా పేరును సుభద్రయే. ఈసుభద్రకై నీవేల యర్జునసన్యాసి కారాదు?

అర్జు—గ్రహచారమా?

ప్రమీల:—గ్రహచారమనుటకు నీకేమియక్కఱ? రాజాధిరాజులు వరించినను వారిపొటేఁ బుచ్చికన్నెటికముఁబాయకున్న ధరాప్సరసతానేపైఁబడి వరింపవచ్చి విలువలేని యనంగసుఖమియ్యఁదలపడినది నీకు గ్రహచారముగదా? పురుషపుంగవా! నీవు నాచేఁ జిక్కినవాఁడవు. ననువరింపఁ బోలెఁ నాయెడకే వచ్చియున్నవాఁడవు. ఇందలి

తరుణులసౌందర్యమునుం బోలెఁబరాక్రమమును నీవెఱుఁగఁగలవు. ఎట్లును దప్పిపోఁ జాలవు. నీదేశపురుషులు చెలులఁజూచిన చందమున నిక్కడి చెలులు పురుషులఁ జూతురు. సమ్మతిగాకున్నను సమ్మతియైన నే నినుమానఁగలదానను గాను. సరసముల నా విలాసాంబుధి నోలలాడక విరసపుఁ బనికి నన్నేల ప్రేరేపించెదవు ?

అర్జు.—కామినీ ! నీసరసమునకు నానమస్కృతులు, నీవిరసములకు నాతిరస్కృతులు. నీతో వాదులాడకున్న నాకుఁ బ్రొద్దుపోదని యెంచితివా ? ఇంక నేఁ బోయివత్తును.

ప్రమీ—నాకుసుఖమియ్యకయా? ఎన్నఁటికిని నినువిడువను. నాకును నీకు నిందొక్కరు లేరు ర మ్మేలసంశయించెదవు ?

(అనుబంధము 38.)

ధరణీశా !—అయ్యో ! ధరణీశాయని వచ్చుచున్నది—యతీంద్రా! నిను నే మానను. ఒక నాఁడింత నాయభీష్టము నెఱవేర్చిన నీశృంగారమంతయుఁ గొల్లవోవునా ?. విడువను. నిను విడువను. (అలింగనము సేయఁబోవ.

అర్జు—రక్కసీ! నీ వింతటి ఆఁగవా ? (త్రోయును.

ప్రమీల—(క్రిందఁబడి కొంతసేపటికి లేచును.

(ప్ర: రూపాంతరముననున్న చారుమతి సుయోగుని నీడ్చుకొనుచు నార్భటించుచు, మలయవతిం దిట్టుచు.

చారు—నేవినను. నేవినను. ఊరకవిడువను. మారాణితోఁ జెప్పెదను. మలయవతీ! యిట్టిద్రోహము చేసెదవా ? వీఁ డెంతవేషము వేసికొన్న నేమి ? రాయభారమునకు వచ్చిన సుయోగుఁడుగాక వీఁడెవ్వఁడు? మిగిలిన యందఱును జెఱసాలలోఁ బడఁగ సుయోగుఁడును నర్జునుఁడును మాయావేషముల వేసికొని పురిఁజేరియుండవలయు.

ఈదురాత్ముఁడు సుయోగుఁడు గదా?

సుయో—కాను కాను.

చారు—నీరొయ్యమీసములు చూచినఁ బదివేవురలో నిను గుఱుతింపవచ్చు నే (కొట్టును) మలయవతీ ! నీవు పూజించిన సన్యాసి యనువాఁడేల యర్జునుఁడై యుండరాదు? వానికి సన్యాసివేష మలవాటుగలదికదా ? ఎప్పటికి వానికది యభ్యాసము.

మలయ—వాఁ డుండఁడు.

చారు—ఉండని యుండకుండని యెందున్నాఁడో తోడ్తెమ్ము. అర్జునున కుండిన వీపు మచ్చ వానికిఁగలదేమో పరీక్షింతము.

అర్జు—(స్వ) ఇదెట్లువచ్చెను ? విషమపరీక్షయాయెనే ?

చారు—మలయవతీ ! చూపు మాసన్యాసిని. ఏలతడసెదవు ? ఎందు రాణి యెద్దకుఁ బిలుచుకొనిపోయి వాని వస్త్రము లన్నిఁటిఁదీయి మచ్చ లేకుండె నా నమస్కారింతము. ఉండెనావాని చర్మము నొలి యేడి యెందున్నాఁడు ?

మలయ—నేఁబిలుచుకొని వచ్చెదను.

అర్జు—(పరుగెత్తిపోవును.)

ప్రమీల—హా ! (అనిమూర్ఛిల్లును.)

మలయ—పట్టుకొనుము. పట్టుకొనుము. (అని వెంబడించును.)

సుయో—(పక పక నవ్వును.)

చారు—(సుయోగుని చెంపఁగొట్టును.)

(నిష్క్ర.)

---

శ్రీ

# ప్రమీలార్జునీయము.

## పంచమాంకము-ప్రథమరంగము.

---

### ప్రమీలయంతఃపురము.

---

[ప్ర: ప్రమీల-కనకలత-మలయవతి-చారుమతి-మాలతి-మంజువాణి-కాదంబిని-మొదలగువారు.]

---

ప్రమీల—చారుమతీ! నీవెంతటి పగదాయవే? ఆమోహనాంగుని సరసనైన నను వసింపనీకయట్లొనర్చితివి.

చారు—దేవీ! ఆ క్రూరాత్ముఁడు నిన్నెంతగా ద్రోచెను! అట్టివాని సరస నీవుండి యేమిసుఖ మనుభవించుచుంటివి?

ప్రమీల—వాఁడు ననుఁజంపి యుండినను సంతోషమునఁ జచ్చుచుంటినే? త్రోసి నందుకు నీకేమివైరము?

చారు—అమ్మా! నీవు మోహమున నిట్లుమాటలాడెదవుగాక యవమతి నించుకైనను యోచింపవు. నీయట్టితరలాక్షిపైఁ బడినను వలదని పాఱఁదోలిన నపుంసకుఁడేటి సరసుఁడు? అట్టివానిఁబొందుటకంటెఁ బ్రాణమైన విడుచుటమేలు. అట్టివాఁడు గాననే పేడియై—

ప్రమీల—చారుమతీ! నీ పూరక వాయున్నదని యాడెదుగాక, నాయట్టి మోహమును దాపమును నీకున్న నీవేమను చుంటివో?

(అనుబంధము 39.)

కనక—దేవీ! నావిన్నప మంగీకరింపవలయు. నీవుతొలుతనే కొంత యలౌకికముఁ జేసితివి. దానివలన నింతయయ్యె. నీవేల నీపేరుఁజెప్పుకొనక ప్రమీలదాని నంటివి?

ప్రమీల:—కనకలతా ! ఒకవేళనేఁ బ్రమీలయని చెప్పుకొన్న నా పురుషవరుఁ డంగీక రింపకున్న లోకమునను వారికంటికి నేఁబలుచనౌచుంటిఁగదా? కావున నట్లొనర్చితి.

కనక—కావుననే యది యలౌకిక మనుచున్నాను. నీవు ప్రమీల వని యతనికిఁదెలిసి యుండెనా యప్పుడె నీయభీష్టము నెఱవేఱుచుండె.

ప్రమీల—సఖియా ! ఏమిమాటయే యిది ? ఆయర్జునుఁడు నారూపమునా లేకనా పేరునా వరింపుచుండినది ? నీవారయక పలికెదవు.

కనక—అమ్మా ! అటుగాదు. మొదట నీవెవ్వరని యాయర్జునుఁ డడిగినప్పుడు మోహఁపుమాటల నెన్నియా డెఁజూడుము. పిదప నీవు ప్రమీలదాసివని తెలిసిన మన సుఁద్రిప్పె. రాజాధిరాజు దాసిని వరించునా ?

ప్రమీల—ఇప్పుడేమనుకొని యేమిప్రయోజనము ? నామోహంపుఁ జిలుక నన్నాదరిం పక నాకొకముద్దయిన నొసఁగక చేఁ దప్పిపోయె. ఇంక నే జీవింపఁజాలను. సఖు లారా ! ఇంకనాయాశమానుఁడు. ఈప్రమీల మీకింక గలుగదు. దుఃఖైకభాగిని యగు నీహతభాగ్యురాలు పుట్టనే లేదనుకొనుఁడు. సతీమణులారా ! మీరింక మా యనసూయకుఁ బట్టముగట్టుఁడు. అది వయసుగలది యగుటవలకు దానిమా ఱుగ మీరెల్లరు రాచకార్యముల నిర్వర్తింపుచుండుఁడు. నేను లేనంతమాత్రముననే యీరాజ్యము నొరుల కీకుఁడు. కనకలతా ! నీవు నాసొమ్ములనెల్లఁ గైకొనుము. మంజువాణీ ! నాశయ్యాగృహము నీవు చేకొమ్ము. మలయవతీ ! నాపెంపుడు పక్షుల నీవంగీకరింపుము. మాలతీ ! నాచిత్రపటముల నీకొసంగితి. కాదఁబినీ ! నావస్త్రముల నీవు తీసికొనుము. ఇంక మీరు నన్ను మఱచిపొండు. ఇట్టి నిర్భా గ్యురాలు మాకుఁజెలికత్తె యొక్కటియుండెఁగా యనుటమాత్రము మఱవకుఁడు. నే నేదేని విషముననో జలముననో యగ్నినో త్రాటనో యంతముచేసికొనెద.

(అనుబంధము 40.)

ఇంక నాకు సెలవిండు. (అని పోవఁబోవ.)

అందఱు—హా ! (అని పట్టినిలుపుదురు.)

(అనుబంధము 41.)

మలయ—దేవీ ! ఇట్లాడుట నీకుఁ బాడియా ? అట్లు నీయంతము నీ వొనరించుకొనునంత యేమివచ్చినది ? అట్టు కావలసియే వచ్చిననేమును నీతోడఁగూడఁ బోవువారము గాక యీతుచ్ఛరాజ్యమున నీచసుఖములనాశించి నిన్నుమాని యుం దుందుమా ?

ప్రమీల—అయ్యో ! నాకెట్టిపగదాయలే మీరు ? ఇట్టిమిత్రశత్రుత్వము సాధించెదరు. నానాథుని నాదండ నుండనీకుండఁ బాపితిరి. నేను నతఁడు నుండియున్న నింకింత

సేపునకైన ననుకూల మగుచుండెనేమో ? అదిలేకుండఁజేసితిరి. చంపితిరి. ఆచావున కియ్యకొన్ననన్ను విడువకున్నారు. చంపియుఁజావనీకున్నారు. ఇంతచూడలేరేని మీచేతులార నను సంహరింపుఁడు, దానికైన సమ్మతింతును.

(అనుబంధము 42.)

మలయ—అమ్మా ! ఇట్లేలమాటలాడెదవు ? నీవు ఫల్గునుఁజూడఁగోరి చారుమతితో నతఁడున్న యెడకేగిచూచియుఁ దనివిదీఱ వీక్షింపలేదనియూరకచూడవలయునని కాదేవానిఁబిలుచుకరాను నన్నంపితివి ? చూచితివి. చూచినప్పుడె కూడవలెనా ? నీవెంత ప్రార్థించినను నిప్పు డతఁడు నినుఁగలసి యుండునా ? ఇంతకే యింతేల యుమ్మలించెదు ? ఇప్పుడు మించిపోయినదేమి ?

కనక—దేవీ ! ఈమలయవతి మాట సత్యము. ఆయర్జునుఁడు సన్యాసి వేషమునఁగదా యిందువచ్చుట ? నీవతనిగుఱుతించినట్టును నతనికిఁదెలుపక పోయితివి. నీవెవ్వరగుటయుఁదెలుపక పోయితివి. ఇట్టిచోరరూపాంతరముననున్న వాఁడిప్పుడే నిన్నొంద్దైనఁబరిగ్రహించి యుండునా? ఇంతయోచింపరాదా ? మరల వానినీవు గంటివేని వాఁడవశ్యము నీకుఁజిక్కఁగలఁడు. నేనూరకనిన్నూఱడిలఁ బలుకుటకై చెప్పుమాటలుకావు. ఇందేదాపున నుండి మేమందఱముఁదిలకించు చుంటిమిగదా? వాఁడునినుఁజూచినప్పుడె భ్రమఁజెంది వితాకుపడెను. అప్పుడు ముఖలక్షణము నాయద్దము నీడ గుఱుతించితిమి. నీవుప్రమీలదాసివని యతనితోఁజెప్పుకొనువఱకు మోహంపుఁ జూపును మాటలును వానిఁబాయవయ్యె. సమయము స్థలమును నునికినిఁజూచి యిప్పుడొప్పక పోయెఁగాక వేఱొకటికాదు. నీవుకొంచెము మించిపోవనిచ్చితివి. త్రోపువడితివి. దానింజూచి వోడమిన యించుక కనలువలన మేమే యాచారుమతింబంపి సుయోగుని నెపమున నంతరాయముగలిగించితిమి. మఱియొకసారి నీవు వానింజూచి మాటలాడితివేని నీకార్యము సఫలమగును.

ప్రమీల—అయ్యో! మఱియొకసారి వానినెందుఁజూతును. ఆ రమణుని పునర్దర్శనమగు భాగ్యమును నాకుఁగలదా ?

(అనుబంధము 43.)

చారు—ఏలవగఁజెందెదవు? ముందెట్టులా యర్జునుఁడు జరుప నుద్దేశించుటయు నామ యోగుఁడు నాకుఁజెప్పఁగలవాఁడు. తేపేమివేషము స్వీకరించునో యేమిచేయునో యెఱిఁగి యోచింతము.

ప్రమీల—చెలియా ! నీ వాతేఁపనుమాట యెంత సులభముగ నెంతవలీలగఁ జెప్పుదువే. ఈరాత్రియే నే జీవింపఁగదా? తేవు నేనెవ్వతెను?

మలయ— (అనుబంధము 44.)

కనక—అయిన నింతాతురముగానున్న నాకొకటితోఁచుచున్నది. ఈరాత్రి నీవే యా తని శిబిరమునకుఁబోయిన నన్నియు ననుకూలమగు.

ప్రమీల—నేనెట్లుపోవఁగలను? పోయిన నెట్లుసిద్ధించు?

కనక—అట్లుగాకున్న నేనేయొక్లైనఁబోయి యామనోహరు నిందుఁదోడ్తెతును.

మలయ—వలసియున్న నేఁబోయెద. నాపై నర్జునునకు విశ్వాసమునుండదు. వాని యెదుట నీచారుమతి నన్నుఁదిట్టినది యావిశ్వాసము నినుమడించియుండును.పోయి వత్తునా?

ప్రమీల—సఖులారా!మిమ్ము నేనమ్మఁజాలను. నాకిప్పుడుతోఁచుచున్నది మీరే యా పురుషపుంగవుఁగోరి నాకుఁగాకుండఁజేసియుందురని, యట్టిమిమ్మునమ్మి యర్జును నొద్దకుఁ బంపఁగలనా? నేనే యెట్లయినను బోయెద.

మలయ
కనక —అట్లేకానిమ్ము.

ప్రమీల—నేఁబోయిన నతఁ డాదరించునా? ఆదరింపకున్న నేనెట్లుభరింతును?

మలయ—అవశ్యమాదరించును. సంశయింపకుము.

ప్రమీల—అయ్యో! నేనెట్టిభ్రాంతనే? మీ వట్టిమాటల విశ్వసించుచున్నాను. న న్నా మహామహుఁడంగీకరించునా? అట్లంగీకరింపఁ గలవాఁడేని యప్పుడె సమ్మతింపక పోయియుండునా? ఎంతవిఁతుఁడినైతి? ఎంతయవమానితనైతి? ఇట్లయ్యు జీవింప వలయునా?

(అనుబంధము 45.)

సీ॥ హయమేధతురగంబు నట్టెపోనియ్యక
దిట్టనై నేనేల కట్టనిడితిఁ।
గట్టితిఁగాక యక్కటయూరకిటనుండఁ
గూడ కర్జును నేల చూడఁబోతిఁ।
జూడమాపురుషులఁ జూచినంతనె పట్టఁ
జాలనిమరులు నా కేలకలిగె।
గలిగెఁబో సమయంబుగాదన కిచటికా
తని నేలపిలిపింప మనసుకలిగె॥

తే॥ గీ॥ బాళినణఁపక యెంతటి బేలనైతి।
పేరుమఱిఁగించి యెంతటి వెకలినైతి।
కోరికవచించి యెంతటి గోలనైతి।
జనవిభునిఁ బొందకెంతటి యనదనైతి॥

ఇప్పుడె యీకరవాలమున (ఎత్తును.)

అందఱు—(హా! హా! అనినిలిపి.)

(అనుబంధము 46.)

చారు—అమ్మా! యించుకతాళుము. నాకొకటి తోఁచుచున్నదిప్పుడు. మా వల లకుఁ జిక్కి యిపుడు చెఱసాల నున్నవారున్నారుగదా? వారివలన నీకార్య మవశ్యము సాధింపనగు. వారందఱు మే మెట్లెగరులాడించిన నట్లెగరులాడుచున్నారు. వారికిఁ జెప్పఁదగినరీతిఁ జెప్పిన నీకార్యము చేకూడును.

(కనకలతా మలయవతుల చెవులలోఁ జెప్పును.)

కనక
మలయ } ఇది మంచిమాట. తప్పక సిద్ధించును.

చారు—దేవీ! నే నింకనుఁ దీనికిఁ గారణములు చెప్పుచున్నాను. ఇప్పుడ మేమందఱము గారాగృహమునొద్దకుఁ బోయెదము.— (నిష్క్రా.)

శ్రీ

# ప్రమీలార్జునీయము.



పంచమాఙ్కము-ద్వితీయరంగము.

అర్జును శిబిరము.



[ప్ర: అర్జునుఁడు-సుయోగుఁడు.]



అర్జు——వింటివిగదా నాచరితము ?

సుయో——వింటినిగాని నీవాసతీమణినిఁ జేపట్టకున్నది తప్పని నాకుఁదోఁచుచున్నది.

అర్జు——నాకుఁదొలుత నట్లేతోఁచెను. చూచిన వెంటనే అచ్చపడి నారూపమును సయిత ము మఱచి మోహఁపు మాటలాడ సాగితి.

సుయో——అట్లయిన నేల యప్పుడె దానిం బరిగ్రహింపవైతివి ?

అర్జు——సుయోగా ! తెలిసి యిట్లేలడిగెదవు ? ధర్మజుఁ డధ్వరకంకణముఁబూని నను హయరక్షకుఁగాఁ బంపియుండ నియమములు మాని, మనవారందఱుఁ జెఱనుండిన చింత లుమాని దాని నేనెట్లు పరిగ్రహింతును ?

సుయో——మీమాటయే మేలు. ఊరకడిగితిఁగాక మీ రిట్లొనర్చినదియే శ్రేష్ఠమగు కా ర్యము. రాజేంద్రా ! చూచితివా ! మనవారిలోఁ నీమోసకారి తరుణుల చేతఁబడని వారు నేనొక్కఁడ, నీవొక్కఁడవు. మిగిలిన యందఱు నెట్లయిరి ? ఇట్టి తుచ్ఛేందు వదనలకుఁజిక్కిన మనపౌరుషమునఁ బ్రయోజనమేమి ?

అర్జు——అదియుండనిమ్ము. నీవీనాఁడు నినుగుఱితించిన వారివలనఁజెఱసాల నునుపఁబడక బ్రదికివచ్చినదేమిక్కిలి యెక్కువ.

సుయో——ననుఁబట్టిన గయ్యాళి నన్నే మోయని యెంచియుండెను. నేను బుడుగు వాఁడ నగుట దుర్బలుఁడనని యెంచెను. మిగిలిన యందఱు జరిగినవెంటనే దానిచీరపయ్యెఁ ట దానికన్నులకుఁదట్టినది. ఒకతన్ను తన్నినది. వచ్చినది [సైగఁజూపును.]

అర్జు—సెబాసు! సుయోగా! నీవు మలయవతి యనుదానిఁజూచితివా?

సుయో—దాని నే నే మెఱుఁగుదును ?

అర్జు—చారుమతి కాదు మలయవతి.

సుయో—అదియెవ్వతయో.

అర్జు—అది కడు నెఱజాణ. నాయెడ దానికిభక్తికలదు.

సుయో—ఎంతభక్తియున్నను మనము నమ్మరాదు సుమా.

అర్జు—సుయోగా! నీవు ప్రమీలను జక్కఁగఁజూచినావా?

సుయో—ఎక్కడిది? రాయబారమునకు నేఁబోయియుండినపుడయిన దానిఁజూడనైతి.

అర్జు—దానిదాసియే యట్లుండ నింకది యెట్లుండునో?

సుయో—మంచిమాటాయె. నీకేమో యించుక మనసుకలిగినట్లున్నది. ఈమాటలనేమి ప్రయోజనము? ముందు జరుగఁదగుసంగతుల విచారింతము. ఱేపు మనమేమిచేయ వలయు ?

[వెలుపలధ్వని.]

అర్జు—సుయోగా! వెలుపలఁజప్పుడు వినిపించె. పోయివిచారించిరమ్ము.

[ప్ర: చారుమతి ప్రక్కన.]

సుయో—[వెలుపలకువచ్చును.]

చారు—(సుయోగునితో రహస్యమాడును.)

సుయో—(అర్జునునొద్దకువచ్చి) దేవా! గానవిద్యానిపుణయఁట! గంధర్వాంగనయోర్తు వచ్చి యోలగము నపేక్షించుచున్నది.

అర్జు—గంధర్వాంగనయా! గానవిశారదయా? మేలాయె. ఇపుడుప్రొద్దెంతైనది?

సుయో—[గడియారముచూచి] జాముదాతిరి యవుచువచ్చెఁగదా?

అర్జు—నడురేయియైయిననుమానె రిమ్మనుము. వీనులవిందుగా నింతగానమువిందుఁగాక.

[ప్ర: ప్రమీల వేషాంతరమున.]

రమణీ! రమ్మిందుఁ గూర్చుండుము. ఏదీ నీవిద్యనింతయాలకించెద. [స్వ.] ఎవ్వ రీ వనిత! ఎంత రూపవతి? దీనిపోలిక నెందో చూచిన జ్ఞాపక మున్నది.

(అనుబంధము 47.)

అంగనామణీ! నీపాట యపూర్వముగానున్నది. దీనియర్థమును గడు స్వారస్యము గానున్నది. కడుసంతసించితిని.

## ప్రమీలార్జునీయము.




కం॥ ప్రవిమలమైసురుచిరమై
నవమోహనమైసుధాభినవమైసరస।
ప్రవణం బైనీగానము
శ్రవణానందంబునించె జలజదళాక్షీ॥

నీయభీష్టమేమి ? కొమ్మా మ్మాత్రహారము.

ప్రమీ—ధరణీశా ! గంధర్వులకు మా కీభూషణము లేటికి ? ఇట్టివాని మాదాసీ జనములకు దినమొకపదిగా నిచ్చువారము.

అర్జు—అయిన క్షమింపుము. నీయభీష్టమైన నేమి ?

ప్రమీ—నాయభీష్టమడిగి ప్రయోజనమేమి ? నీవేమైనఁ దీర్పనున్నఁగదా ?

అర్జు—(స్వ) ఎందో యీధ్వనియు వినియున్నాను. తరుణీ ఇక్లేలడిగెదవు ? నేఁ దీర్పఁజాలని దెట్టిది ? నిర్భయముగా నడుగుము. ఎట్టిదానినయిన యుక్తముకానిది గాకుండిన నిచ్చెదను.

ప్రమీ—మహాత్మా ! మాలోకమునందంతయు నీరూపవిఖ్యాతి నిండియున్న ఎన్ని యజ్ఞము లెన్నితపములు చేసియుఁబడయఁజాలని యీ యూర్వశి తా నాశించి వచ్చినను వలదనిన ధీరత్వ విఖ్యాతియు నిండియున్నది. నాటనుండి నిన్నుజూడ వలయునని నాయభిలాషము. ఇంత వఱకది సిద్ధింపదయ్యె. నేఁడు నిన్ను జూడ వచ్చుట నమకూరె. మనోహర పురుషులయెడ స్వచ్ఛంధవర్తులము మంగళాంగులము దేని నభిలషింతుమో దాని వేఁడుదాన.

(అనుబంధము 48.)




అర్జు—రమణీ! నీయట్టిగాన విద్యానిపుణయు సరసాగ్రేసరయు నగు యువతి యిటు ప్రార్థించుట భాగ్యముగదా ? అయిన నామనవి నంత వినుము. నేను ధర్మజుఁ డొనరించు మఖమునశ్వము వెంటఁ బడివచ్చియున్నవాఁడ. యాగదీక్షనాతఁ డెట్లో యేనునట్లు వహించి నియమవ్రతము సలుపుచున్నవాఁడ. కావున నిపుడు క్షమింపుము.

ప్రమీ—పురుషపుంగవా ! ఇదేమిమాట ? హయరక్షగావచ్చిన నీకు నియమము లేల కావలయు? కాముఁడు నను సుమశరముల పాలు సేయుచున్నాఁడు. ఇంచుకతడసిన నాప్రాణములు నిలుచునట్టు లేదు.

(అనుబంధము 49.)

ప్రమీల—పురుష పుంగవా ! నేవినఁజాలను. నీవీకార్యమొనరింపక తప్పదు. ఇంత దూరమునుండి నిను వెదకికొని వచ్చిన యతివ కాశాభంగ మిట్లొనర్చుట పాడియా?

అర్జు:—కామినీ ! నను వెతలఁబెట్టకుము. అన్ని నియమము లట్లుండ నావెను వెంట సహాయభూతులుగా వచ్చిన మేఘవర్ణ సాత్యకీ వృషకేత ప్రద్యుమ్నాదులు, నీపుర భామినులకుఁజిక్కి నిర్బంధముననుండు వారు. వాజిమేధహయమును వీరిఁచేఁజిక్కి నాకింకను నబ్బకున్నది. ఇట్లుండ నేమిసంతోషమని నేను నీయభీష్టము నెఱవేర్తును? ఊరక నను బాధింపకుము.

ప్రమీల—ధరణీశా ! ఈ కార్యమున కింత కావలెనా ? నీ వీపనికించుక సమ్మతించిన నీహయము నీకిప్పింపఁగలను, ప్రద్యుమ్నాదుల నెల్లఁజెఱవిడిపించి నీకుముదముజనించునట్లు చేయఁగలను. తుదకాప్రమీల నే నీదాసిగాఁజేయఁజాలుదు. యోచింపకుము.

అర్జు—(స్వ) ఇదేమీకాంత యిట్లనుచున్నది ? ఇది యెవ్వతెగా నుండనోపు? (పరికించి) ఈ కామిని, యిపుడు తెలిసెను. ఆభవనమున నేఁజూచియుండిన ప్రమీల దాసికాదాయిది ? నావలె నిది యిప్పుడీ వేషముఁబూనివచ్చినది. (ప్ర) కామినీ ! నిన్నెఱుఁగుదు లెమ్ము. ఈయూరికి నవీనాగతుఁడైయున్న యొకయతి నిన్న నీయింటఁజూచినట్లును వానినీవు రతిఁగోరినిర్బంధపఱచి నట్టును నాయతియింతవఱకు నాతోఁజెప్పెను. అతఁడుచెప్పిన యంగమచ్చముల గుఱుతులన్నియు నీయందుఁగను పట్టుచున్నవి.

సుగంధివృత్తము॥ నీసుధవిలాస మింక నీకెయుండ నిమ్ము నక్క
మోసగింప నెంచితే వినోదమే ప్రమోదమే
వేసరంగఁబోకు నీకువిన్నవించువాఁడ నో
భాసురాంగి యిట్టిభంగి పాడిగాదుమానినీ॥

కన్నవారిఁగలయఁగోరు కాంతలన్నె నీకవ్వడికాంక్షించునని యెంచితివా? నీ వా ప్రమీలదాసివగు సుభద్రవుకావా ?

ప్రమీల—నరపాలకచంద్రా! ఇంతకువచ్చిన నే నేలదాఁచవలయు? నీవేల యీయుక్తులాడెదవు? నే నేయాయతీంద్రుతో మాటలాడినదానను. నేఁబ్రమీలదాసినిగాను, సుభద్రనుగాను. ఆయర్జునుఁడు యతివేషముధరించి పురిఁబ్రవేశించినాఁడనియెఱిఁగి యతని యభిప్రాయముఁదెలిసికొనక నన్ను నే నెఱింగించుకొనుట యనుచితమనియెంచి ప్రమీలదాసినని చెప్పికొన్న యాప్రమీల నే నేను. ఇంకైననాశయము గుఱుతించితివా? ఇప్పుడైన నాశుద్ధమానసము నెఱిఁగితివా? భూరమణా! నిన్నే నమ్మినదానను. దైవమవంచుఁ, బ్రియుఁడవంచు, నాథుఁడవంచు, సఖుఁడవంచు భావించుచున్నదానను. అనదను దీనను ననన్యథాగతికను, ననుఁదెగడనాడకుము. ననునిరాశఁజేయకుము.

విడనాడకుము. త్రోయకుము. నీపాదములయాన. నినుగా కోరుని నేఁ గోరినదానఁ గాను.

అర్జు—(స్వ) ఆహా! ఈ తన్వియా ప్రమీల? నామది నిదియాకర్షించుచున్నది. అయ్యో! నేనేల చేలనగుచున్నాను? ఇట్లొనర్చుటతగునా? (ప్ర) తరుణీ! నీకేటి కీభ్రాంతిగలిగె? ఇదివలవని దురాశ. దీనిమానుము.

ప్రమీల—ప్రాణేశా! నన్నిటు నిరాదరణమొనర్ప నాయపరాధమైననేమి? ఆసుభద్రయు నాయలూచియు నాచిత్రాంగదయుఁజేసినపుణ్యము నేఁజేయనైతినే? నాథా! నినుమానను. నీవేమన్ననుమానను.

(నమస్కరించును.)

(అనుబంధము 50.)

అర్జు—వనితా! ఇదియా నీధీరతనము? ఇంకూరకుండుము. నాకుఁగోపముగలుగు.

ప్రమీ—నీకుఁగోపముగలిగిన ననుసంహరింపుము. కాదనను. స్వవనితను సంహరించుటకు నాథుఁడు స్వతంత్రుఁ డని యందురుగదా?

అర్జు—ఇంకఁ జాలు నీ సరసము. వ్యభిచారమున శత్రులఁగెలువ నుద్దేశించుట వ్యర్థమని యెంచుము.

ప్రమీల—(కోపమున) ఓరీ! మహార్తింగుందుచున్న మగువ నెట్లాడిన నాడవచ్చునను కొంటివా? నీవాయి నిన్నాడ నిచ్చినంతయు నాడెదవా! నన్ను వ్యభిచారిణియని యాడెదవా? ఏల పలుకవు? దయ్యముపోలె మగఁడుండ వానియెదుట యమాదులతో సంపర్కమొనరించి మిమ్మెల్లరఁగనిన కుంతియెట్టిది? మీకన్నులయెదుట మీయిందఱితో నేకరీతిఁగలయుచున్న నీసతిపాంచాలి యెట్టిది? అట్టిదాని కొడుకవు, నట్టిదాని పతివినీవు. నీకిట్టిమాటలుగా కింకెట్టిమాటలు వచ్చును? ఆరయనేరక నన్నిట్లాడెదవా? కావలసియున్న నావాక్యము నీతల్లిపై నీ సతిపై బ్రయోగింపుము. అప్పుడది సమంజసమును సార్థకము నగు.

అర్జు—పవిత్ర చరిత్రల నిట్లాడిన నాలుక గోయింతును.

ప్రమీల—నా నాలుక నీవు కోయింతువో నీనాలుక నేఁ గోయుదునో యెఱుఁగగలము. నిలువుము.

(అనుబంధము. 51.)

అర్జు—తరుణీ! నాప్రాణముపై వచ్చువఱకు నేనంగనలపైబాణమెత్తను. నీయిచ్చ చొప్పున యుద్ధమాడుము చూచెదఁగాక.

ప్రమీల—ప్రాణకాంతా! ఖడ్గముఁబాఱవైచి నేనెంతటి పలుగాకిని! ఎంతదుష్కృత్య మొనరించితి? ఇది ప్రణయముగాని నిక్కంపుగనలుగా భావింపకుము. నన్నాదరింపుము. వరింపుము. రక్షింపుము.

అర్జు—ప్రమీలా! నీవేల యిట్టిమోసములు చేసెదు, త్రికరణ శుద్ధిగానిను నెవరి

[ప్ర: రభసముగాభుజబద్ధులై ప్రద్యుమ్నాదులు.]

ప్రద్యు—తాళు, తాళుము. నిలుము నిలుము. నీవువరింప నేనలయు తప్పదు.

సాత్యకి—ఔను, ఔను. వరింపవలయు, వరియింపవలయు.

అందఱు—గట్టిగా వరింపవలయు. వరింపవలయు.

అర్జు—ప్రద్యుమ్నాదులారా! ఇదియే మాగడ మిట్లాడెదరు?

ప్రద్యు—ఏయాగడమునుగాదు. నీవు వరింపకున్న నీయిచ్చచొప్పునఁబొమ్ము. మే మిందే యుండెదము.

సాత్య—మేము హయము నెత్తుకొని యెక్కడికైనఁబాఱిపోయెదము. ఇంక ధర్మజుఁడు మఖము నిర్వహించనీ.

మేఘు—ఆహయమును నేఁగత్తిరించి వైచెదను.

నీల—నేనిక్కడ విడిచి ముందొక్కడుగురాను.

సాంబ—నెత్తిన గుడ్డవేసికొని నీవేపొమ్ము. మేమురాము.

అర్జు—మీరేలయిట్లు విజృంభించితిరి? చెప్పినదియైన నేమి?

అందఱు—విజృంభణము. మఱివిజృంభణము. ఇంకను విజృంభణము. నీ వీసతిని వరియింతువా లేదా?

అర్జు—లేదన్న?

అందఱు—మేమందఱము నిన్నెత్తికొని పోయి చెఱసాలలోనునిచి మానారీమణులతో మేము భోగభాగ్యముల ననుభవించెదము.

అర్జు—సుయోగా! ఈమూఢులేలయిట్లైరి?

సుయో—మీరవశ్యమీ నారినివరింపవలయు. కాకున్న నేనిందుండను. వీరివెంటఁ బోయెదను.

అర్జు — నే నేమొనర్తునింక?

(అనుబంధము 52.)

ప్రమీల — దేవా! ఇందఱు నాళోఁలకు నినువేఁడుచున్న వారే నీ కేల కరుణరాదు?

అందఱు — (అర్జును చేపట్టి ప్రమీల చేతిఁ గలియఁజేయుదురు.)

అర్జు — ప్రమీలా! మనవారికిందఱికిష్టమైనపని నే గాదందునా? అవశ్యము కానిమ్ము. అయిన సవనము కడచనువఱకుమాత్రము ననుక్షమింపుము.

ప్రమీల — ప్రాణేశా! ఎప్పుడెప్పుడు నీవిలాసాంబుధి నోలలాడుదునని వేకరుచున్న నాకు నిమేషమొకయేఁడై తోఁపఁగలదు. అయినను నీవంగీకరింతునని చెప్పినదే పదివేలు. సోమపానమైనపిదపనే నాయధరపానముఁగానిమ్ము. అయిన నీహయము వెనువెంట నీతోఁడఁగూడి యేతెంచుటకును యజ్ఞమునకు మీయూరికివచ్చుటకును నను గ్రహింపవలయు.

అర్జు — తరుణీ! అట్లు లే కానిమ్ము.

[ప్ర: కాదంబిని, కనకలత, చారుమతి, మాలతి,
మంజువాణి, మలయవతి, మంజరి.]

స్త్రీలు — (వారివారిపురుషుల బంధనములు వారువిచ్చుచుండఁగా.)

స్త్రీ పురుషులకు వివాహములు.

(అనుబంధము 53.)

మంగళము.

---

శ్రీ

# ప్రమీలార్జునీయము.



ఉత్తరరంగము - The Epilogue.



సీ. సతులకించుకయైన స్వాతంత్ర్యమిచ్చుట
తరముగాదనుపుణ్య పురుషులార
స్త్రీలకు విద్యనేర్పించిన లోకముల్
మునుఁగునంచనుధీర మనుజులార
పాటింపఁగూడ దెచ్చోటఁ గాంతలబుద్ధి
ప్రళయాంతకం బను భవ్యులార
సుతులగాంచుటకంటె సతులకు నింకొక్క
పనిలేదనెడు మహాప్రభువులార

తే-గీ. ఆలకించితిరే ప్రమీలార్జునంబు
నరసితిరె వీరు పురుషుల నాడుభంగి
యెంచిచూడంగ నాశ్చర్యమేమికలదు
బలముగలవారె యెయ్యెడఁ బ్రభులుగారె.

ఉ. మానవతీలలామ మగ
మానిసితోడు వహింపకుజ్వలం
బైన మహావనిన్ జతురు
పాయ ధురీణత నేలి సర్వది
జ్ఞానిత వైభవంబునన
మానబలంబును గన్న యీప్రమీ
లా నళినాయతాక్షికి ని
లక్షసమలెవ్వరు కీర్తిసంపదన్,

సీ. అనిలోన నరకాసు రుని డీలుపడఁజేయఁ
బరఁగిన యొక సత్యభామగలదె
పతికి సారథ్యంబు వఱపి యాదవసేన
బడలించు నొక్కసు భద్రగలదె
అరిసతుల్విధవలౌనం దాఁక ముడిఁగట్టఁ
జాలని యొక్క పాం చాలిగలదె
రాజ్యధోరణియెల్ల రాజులు భళియన
నేలెడు నొక్క ప్ర మీలగలదె.

ఆ-వె. కలుగరైరె భరత ఖండంబునను మున్ను
ధీరసతులు విమల భూరియశలు
ఇప్పుడట్టివార లెందైననున్నారె
లేరు లేరు లేరు లేరు లేరు.

సీ. మున్నటివారేల కన్నారఁగనమె నేఁ
డున్ననారుల వారి నెన్న వలదె
చక్రవర్తినిసావి శాల ధారుణినేలి
క్రాలు విక్టోరియా రాణిలేదె
పాండిత్య పరిణతో పన్యాసములనించి
జగమెన్ను నానిబె సాంటులేదె
విమలకావ్యంబుల నమృతంబు గురియించు
జేనాష్టినను మంద యానలేదె

తే-గీ. ఊయుడాదులదెందఱో యుండలేదె
పశ్చిమధరాతలంబున భరతఖండ
మున నొకర్తుక యట్టి బల్వనితకలదె
కటకటాయిట్టి దిశకేమి కారణంబు.

సీ. తనకన్నబిడ్డల కనువార విమల వి
ద్యావినీతుల నేర్పు తల్లియేది

పితరులు గౌరవ స్థితిఁగాంచఁగలిగిన
విజ్ఞానధన్యయౌ బిడ్డయేది
గోడువెట్టక తన కోడలికిని ధీర
చిత్తంబు గలిగించు నత్తయేది
పోరకచేటలఁగాక పోరిన త్తమామల
గురుబుద్ధిఁదనియించు కోడలేది

తే-గీ. వరసుధీగరిమంబున వన్నెనెక్కి
తనమగనిఁ దప్పుత్రోవలఁ దగులకుండ
నంకుశంబుగ గృహకార్య యాత్రలెల్ల
భారమువహించి వెలయించు భార్యయేది.

క. ఏరాజ్యంబునఁ దరుణులు
దారకళాకుశల సుస్వతంత్రలుగలరో
యారాజ్యంబునఁ బురుషులు
ధీరులునధికారు లమల ధీసువిచారుల్.

క. ఏరాజ్యంబునఁజెలులవి
చారలు పరతంత్రల స్త సత్వలుగలరో
యారాజ్యము పురుషులనా
ధారులునవిచారుల స్వతంత్రవిహారుల్.

సీ. అన్వర్థముగఁగాంత యబల కావునదయా
జ్వాలసమత్వమునింప వలయునుండి
పుత్రులకిలమాతృ బుద్ధిపాల్పడుఁగాన
లలన విద్యలనేర్ప వలయునుండి
నీరజాక్షికి విద్య నేర్పినంతనె మగం
డలసికూడుడికింప వలదునుండి
స్వాతంత్ర్యమగునంత వనిత పతివ్రతా
భావంబు తక్కువ పడదునుండి

అ-వె. విద్య నేర్చినంతవిరిబోణి స్వాతంత్ర్య
మడరభక్తివాయు ననుట తగునె
విద్యలేనివారు వెలయాంధ్రుకాలేదె
కొందఱవనికల్ల నిందసుండి.

సీ. స్వాతంత్ర్యమీకున్న వలదుపోవఁగనిందు
పారతంత్ర్యము మాత్ర వలదుసుండి
పూజసేయకయున్నఁ బోయె నేలనుబెట్టి
కాలరాచుటక్రూర లీలనుండి
ఎల్లవిద్యలనేర్ప నొల్లరో వలవద
జ్ఞానవారిధి ముంచఁ జనదుసుండి
రాజ్యతంత్రముల నేర్పకయున్నఁ బోనిందు
ప్రకృతితంత్రము ద్రుంప వలదుసుండి

తే-గీ. అపుడు మానస సుఖములిం పారుసుండి
యపుడు మీపారతంత్ర్యంబు లడఁగుసుండి
యపుడు దేశంబు వృద్ధిమై నలరుసుండి
యపుడు మానవత్వము నిశ్చ యంబుసుండి.

# అనుబంధము. (Appendix)

అనుబంధములు.

1\. రాగం-కాంభోజి. తాళము-ఆది.

కమలావరనీదాసుని-కాపాడఁగరా రాఁదే
రమణీయము నీపదసేవనెః
సమంచితము మానను దేవా॥

సాంగవేద పదసంగతకరుణా-పాంగదానవ విభంగచతితసా
రంగపోష సువిహంగమహాహా-రమాకరా-సమాశరా-రఘు
వీర॥




2\. రాగము-శహాన. తాళము-రూపకము.

సాటిలేనియీవన-వాటిఁజేరనెందు-వరము సుజన
తోటలెల్లనిండి-సుమములచే-నీటుచేయ-నిరత
వెలయు ॥

మంజురీతిబికములు-శింజితములఁజేసెముద మలరఁగ.
వరిజుళ్ళములనీడ-కడురుచిరము-కంజపాళి-గనుఁగొనఁగా
మనమలరె. ॥౨॥

భృంగతతులు ఝుమ్మని-పొంగిపాటపాడ-వినమధురము
అంగజాతుధాటిఁ బురికొలిపెడు-అంగనలకు నొల్లని మదిఝ
ల్లనఁగా ॥3॥

యురుపూజసేయఁగా-కోరఫలము లిందుకొఆవడవె
కీరతతులఘోళములు గలిగెను-ఘారకుహలసారసములుపూర
సములు ॥

అనుబంధములు.

సామగాన పరితోష భక్తజన-కామితదాయక తాపహారా
రామకృష్ణ కవిపూజితనామ-రమణీయమణిభ్రమ మణీయఘృణీ॥

3-4. రాగం-కమాజు. తాళం-రూపకం.

తురగాధిపాలులార-మీర-లందఱెందరును
హరి-మేధవాజిపోవుదారి-మీరిపోకుడీ.
ఏ-సీమనెట్టిరాజుదీని-జేరిపట్టునో
కడు-భీమభంగిఁద్రుంపవలయు-భీతిగానక. ॥౨॥
ఇదె-యిందుహయము బెదరినిలిచె-నేమిచోద్యమోముదమంద
నట్లుపట్టిచుట్టి-ముట్టినిలువుఁడీ. ॥౩॥

4-5. రాగం-దర్బారు. తాళం-ఆది.

స్త్రీలు——భళిరేయెక్కడిదీ హయము-తిలకింపఁగనగునబ్బురము కలిగిన మనకాఘనఫలము-బలువిడిదీనిని బట్టుదము.(పట్టుదురు.)

హయ——నేమపుయజ్ఞ తురంగమము-నేమనిపట్టితిరీహయము భామలారవలదీ విధము-కామింతురె చేయఁగదురము.

స్త్రీలు——సవనతురంగమ మిదియైన-జవగతి బట్టెదమిది మానవమఖలనుగానిమ్మేమైన-నవరి బెదరుదుమెమదిలోన

హయ——తరముగాదు కాదిదినయము-ధర్మజుఁడంపిన దీహయము.
మరణం బగునగు నేజయము-పరికింపఁగలేదెభయము

6. రాగము-కమాజు. తాళము-అట.

హయ——వాజిమేధ హయముధర్మ-రాజు పంపెను-రాజవదనలారమీకు నోజగాదు దీనిబట్ట-రాకుఁడీ-హయముముట్ట-బోకుఁడీ-తేజిబట్ట ॥౧॥

అనుబంధములు.

స్త్రీలు——ఎట్టిహయము కాని-మేముపట్టువారము-ఎట్టిరాజు వచ్చె నేనిఁ
గొట్టువార మింక మిమ్ము-గొట్టమే-సవనహయము-బట్టమే-
వైరులఁబడ-కొట్టమే ||౧||

హయ——క్రీడివచ్చెహయము వెంటనీ వెచూడుఁడీ-ఈడుగాదు పాడి
గాదు-చూడ రేల చేడెలార -రాకుడీ.

స్త్రీలు——నీడఁబోక వాడియంప వేడిచూపఁగాఁగ్రీడివచ్చె నేని రుద్రుఁడీ
డవచ్చె నేనిమేము-పట్టమే.

7. రాగం-కమాజు తాళము-ఆది.

మాకునలవి యె-వీరిగొనియాడఁగా
లోకమున నెందులేని-వీఁకజూచితిమి
యీకరణిసతులమే-మెందునై నగంటిమే.
ఈ యొయ్యారము-నీశృంగారము
నే యెడనై నను-నెఱుఁగము ధరలో ||౧||

8. రాగం-అసావేరి. తాళం-రూపకం.

అందరు——మనసిజాతలాలనా రమా-రమా-
ధనవిశాల-గుణసుశీల-ప్రణతపాల-నా-
జననీ-శ్రీ-మా-దే-వీ-
వనజాతవాసినీ

9. రాగం-జంజూటి. తాళం-ఆది.

అబ్బా యబ్బా-యదేమి రూపమబ్బబ్బా-
తబ్బిబ్బులాయెను-పెనుమబ్బుమూసెను
నేనుబ్బిపోవఁజాలను. ||పల్ల||

అనుబంధములు.

అయ్యో అయ్యో - వెయ్యేలచేరఁజాలను
రావయ్యేమాటలు - లేవయ్యేఁగన్నులు
ఆ - దయ్యామెలుఁగును మాయబ్బా.

10. రాగం - కాంభోజి. తాళం - రూపకం.

ఔ రాయింతటిపాటువచ్చునె - శూరకోటికిముదమొదవెడు.
సారసాత్తులు - చేరవచ్చిన - క్రూరంబగువైరంబున నేరీతిగ -
బోరాడుద. ॥ఔరా॥

ఇలలోఁగలశూరాళికి - బహుసాహసమగు నేయిటు - కల్గఁల
నవ్వారెజనములు - బలుదుర్యశమలరార దెలలనాజన - మిక
జంపఁగ.

11. రాగం - కమాజు. తాళం - ఆది.

పోరాడ మాకుఁదగునే నారులతోడ
పోరగసిగ్గగు - నారులతోడను - వైరమిదేలాగలిగె.
చాలఁగ బాణము నేలీలబూనుదు - సోలవలసె యూరకె.

12. రాగం - జంఝూటి. తాళం - రూపకం.

మేఘ——నారీమణితాళెదవే - దారుణమీ - నారసము.
దారుణము - ఎంతయును - మిక్కిలియు - చూడఁజూడ.

మలయ——పోరఁగలవెయసురా - పారకరా - రారయిటు,
ఊరికిని - పారక - వెనుబడి - నాకుమ్రొక్కి.

మేఘ——చేడెవిను నాకనిలో - నోడితినను - మానెదనీ వాడిగల బాణ
మెద - గాడిననే - మాడెదవో (ఈశరము - బాణమెదనీయెదను.)

మలయ——కానికానిహీననిను - న్మానెదనే నేననిలో
నానిశిత బాణములకు - బోనగునే ప్రాణముతో (నీకుమఱి ఎం
దునైన వలదని.)

అనుబంధములు.

13. రాగం-బ్యాగు. తాళం-ఆది.

మేఘ—సరోజలోచన-విరోధమిది యేటికినాతో రణభూమి.

మలయ—సురారినీచుఁడ-కరాసి నిను నేఁడునుమాడనే పొగశేల.

మేఘ—ధరాధరారాతియా - సురేంద్రుఁడేవచ్చిన-దురంబు నాతోడఁ
జేయఁగలఁడేమో-యరాళసి రోజయాహావమున నిన్నార్చెదఁ
గనుమా.

మలయ—అదేల సురేంద్రుఁడా-వా-మదేవుఁడే వచ్చిన-విదారణం
బేను జేయ నేర నెయో-మదాంధనీకేమి మానమువలెనా-ప్రాణ
మువలెనా.

14. రాగం-కమాజు. తాళం-ఆది.

మాలతి—ధీరా-మేరా-యిదిశూరతనమా
పారిపోకనిల్వుమింక బలుమాటల నాడలేల.

సాత్యకి—బాలా-చాలా-మేలాయె నీలాగు
పోలదీలాగాజినీకు-పాలతీ-వలఁతీచాలాయె.

మాల—ఊరకె మాటల-ధీరతనముగాదు
భూరిధనువుపట్టి నిలిచి-పోగడం జగడంబీరాదే.

సాత్యకి—ఈ పరితాళఁగ-నోపుదెయబలా
మాపాలనూ నిల్చుటిది-మగువాపొగడందగదే.

15. రాగం-కమాజు. రూపకంతాళఁ

సాత్యకి—పోరాడఁజాలవయో
పాలతీ యాలమునఁబోరాడఁ

మాలతి— నీకేలయీకరుణ
నిక్కముగా ||సా||

అనుబంధములు.

సాత్య—తరుణీనిన్నుఁగన-గరుణయుప్పతిలె
ియీాదుర మెట్లాడఁగల.

మాల—కరుణాలోకమున-బోరలక్ నిక్కముగా
నా-శరముల్తీవ్రముకా ॥పల్ల॥

16. రాగం-జంజూటి. తాళం-ఆది.

వృష—ఆలముననను నాకెదురెవరు-శూలియు నింద్రుఁడు నిలుతురోకో
బాలవు మిక్కిలియబలవుగా-సొలితినని వడిఁబరుగిడుమా.

మంజు—బాలుఁడవెంతటి మూర్ఖుఁడవు-ప్రేలకు నీవొక శూరుఁడవే
శూలములగు నాబాణములక్-దాళగల వెవతెబ్రబికెదవే.

వృష—అట్టులైనఁగోను మీశరముక్-నెట్టినఁదాళుముచూచెదను
గట్టిగనిల్చిన ప్రాణములక్-బట్టుగదీసెదుఁగనుమబలా

మంజు—ఏమిరయంతటి శూరుఁడవే-నామహితాంబక మిదెవిడుతుక్
సామర్థ్యంబున నీదుశరం-బేమాయెనుగంటి వెబాలా

17. రాగంబ్యాగు. తాళం-రూపకం.

సుమో—తీరుగాదుమేరగాదు-పోరఁగలవెచూడుడీ
ఘోరయుద్ధమాడనేల-నారులారవీడుఁడీ ॥పల్ల॥

మంగళాలింగనంబు నంగజాతుసంగము
రంగుమీఱగోరవలదె పొంగెనంత రంగము.

చారు—సాటిగాదు పాటిగాదు మాటలేలమానుమా-
సూటిమీరబాణసమితి-నాటనెందుపోయెదో.

ఏలయీావిచారమిందు-పోరనిల్చి చూడుమా
లీలతోడనింతలో-కూలచేతుచాలునే.

అనుబంధములు.

18. రాగం-జంజూటి. తాళం-ఆది.

కనక——ఒక్కరును-పోరాడువారే-లేరుగదా
ఎవ్వరును-పో-కొంతయును పోయిందుమరి. ||పల్ల||

పోరఁగజాలు వీరులెలేరు-పారాడియారసివేసారితినిమఱి. ||పో||
కుంతీకుమారు - ఁడెంతటిభటుఁడో- వింతాయెనీ యాజినింతైనఁ
గానమఱి.

19. రాగం-బ్యాగు. తాళం-ఆట.

ప్రద్యు——భాసురాంగీమణీ చూడరాదా-నను-దాసుఁగాఁగై
కొనియేలరాదా-మీసరమాయెను దాళఁజాల. ||౧||

కనక——పోలదీమాటలనాడనేలా-యీలీలసంగ్రామము
మానవేల-దూలిపోవ-నరిసోలిపోవ-వడివోర.

ప్రద్యు——మంగళాంగీయిటు పోవకుమా-నాకు-కౌంగిలీక త్రోయకుమా
కౌంగిలీక త్రోయకుమా యిటుభంగమొందఁజేయకుమా.

కనక——ధీరవిలాసయీతీరుమేలా-యని-పోరకీవిచారములా
పోరకీవిచారములా-కడు భీరురీతివాదములా. ||పల్ల||

20. రాగం-జంజూటి. తాళం-ఆది.

నీల——ఎంతేనిపొగడుదునింత-యీ-కాంతలచెలువమువింత || మావార
లువెలిరారైరే-యీ - నారులవలఁబడిపోరే, ఏదారినిఁజూచిన
లేరే - యీనారులవలఁబడిపోరే, ఇది-దురాగతముగాదా-దు-
ర్యశంబలసిరాదా-భీతిలేదా-చూడబలువింత.

ఈచానకానకటుపోయె-ఇం-తైన కరుణలేదాయె || తుదలేనినిం
డువెతలాయె-ఇంతైనకరుణలేదాయె-ఓ-మనోజ్ఞకలవాణీ-నను
గనంగనవెరాణీ-మంజువాణీ-రావె-నాపొంతా.

అనుబంధములు.

21. రాగం-పీలు. తాళం-ఆది.

మలయ—కడు-పరాకు మానియాలింపుమా-మా-భంగము దేవీ.
పార్థునిభటులు-పారఁగదోలఁగ-వ్యర్థులమగు
గతిగలిగె-యనర్థములాయె. ||౧||
పోడిమివారితో-బోరఁగఁజాలక - మోడితి మమ్మయేమనఁగా
మేము-నేఁడబలలము. ||౨||

22. కాంభోజిరాగం. ఆదితాళం.

ప్రమీల—ఏమిది చిత్రమొయేమియుఁ దెలియదు
నామది నేమియు-నమ్మిక పొడమదు.
ఇలలోన నెందును-దులగానకున్నమి
మ్మలక్రీడి నేఁడుతా-గెలువంగఁ జాలెనే. ||౧||

23. మోహనరాగం. ఆదితాళం.

ప్రమీల—కోనిరమ్మా-మంజరీ
ధనువు నిషంగము తడయకనసియు ||పల్ల||
నారథ మిప్పుడె-చేరికఁ బూన్పుము
సారథి వగుము నీవూరక తరుణీ.

24. నాదనామక్రియ-రాగం. ఆదితాళం.

సుయో—అగునే యిది బలుద్రోహమే ||నా||
తగని విరోధము-మిగులఁగనగునా
నిరతమునమ్మిన-గురువునకీగతి
దురితము లెంచుట-పాడియే. ||౧||

25. రాగం-కమాజు ఆదితాళం.

ఈడులేని భాగ్యమలరె-నేమి తెలుపనీ
స్వాదనిరంకోమానకనిక గూడియుండుదు.
కూడియుండుదు.

అనుబంధములు.

వింతమీతె నింకనాదు సంతసంబునీ
చెంతఁ జేర్పుముదము వెలయ-నింత వేడెదే. ||౧||

26. రాగం-కాంభోజి. తాళం-రూపకం.

ప్రమీల——చాలదే-భూపాలుఁజూచిన-ఁజాలదే.
బాలసోముని లీల గేరెడు ఫాలమునుగనఁజాలదే-హాళిమీరగ-

మేలియురమున-సోలినిరతము బాళిమదనుని-కేళినెనయఁగ వెలసినఁ
జాలదే||

27. రాగం-జంఝాటి తాళం-అట.

అందరు——పగమీఱనాగీవారముంజంపక
తగనివగలఁ-బడితిమే ||పల్లి||

మేఘ——మలయ-పతినా-కెంతటి-కార్యము
సలిపెనా-వెలఁదిరా-దెదుటికి || ||౧||

సాత్య——మాలతీ-యీవిధి-దీనత-నించితే
యేలనా-యెడకురా-పళికులా ||౨||

ప్రద్యు——వినుతమా-నాయశం-బంతయుం-బోవఁగా
కనకల-తనుగని-బడలితి ||పల్లి||

28. రాగం-హిందూస్థాని తోడి. తాళం ఆది.

అందరు——ఘనవేణీననుఁజేరవే-కనికరించి యేతేరవే-యనవరతము||

మేఘ——నీవాఁడనేనిక్కముననుఁబ్రోవఁగ పూబోణిరో రావేలవెలిదీయ
రావేల కరుణ || ||౧||

ప్రద్యు——నను వెలార్పఁగనేటికే-కనకలతాంగనారాగదే.
నినునింకఁ గనకున్న మనఁజాల కనకాంగి ||౨||

అనుబంధములు.

పాత్య—తాళఁజాలమరుబారికి-జాలమేలనను గావవే మాలతి నీకేటి
కీలాగువగ.

29. రాగం-బ్యాగు. తాళం-రూపకం.

సుయో—దారి-తెలియ-దయో-దూర మెంతచూచిన

అర్జు—ఓరీ-మూఢమతీ-ఏ యిట్టులాడెదవు.
సుయో—పాడుపురిని-వీధులెల్లఁ-జూడనొక్క తీరుగా.
అర్జు—ఇట్టివాడవిందునన్ను-నేలతెచ్చినాడవు.

30. రాగం-చక్రవాకం. ఆటతాళం.

మలయ—చాలఁగ శ్రీదము-లీల మైమీపాదము.
చాలఁగా గ్రాలుగా-వెయ్యేలకావంజాలుగా. ॥పల్ల॥

పావనముగా-జేసెనాదగు భవనమంతయు నీక్షణములో
దేవధరణీదేవకుంజర దీనజనములఁగాచుఁగద. ॥౧॥

భూనుతంబగు భాగ్యమలరెను-బుణ్యమయ్యెఁజరిత్రము
జ్ఞానమహిమాతీతమియ్యెడ-నేనుధన్యతఁజెందితిని. ॥౨॥

31. రాగం-కల్యాణి. తాళం-ఆది.

ప్రమీల—సుందరునిగనకయికనే మనఁగఁదరమా.
భూపమౌళివచ్చినాడు-ప్రాపుచూపకున్న నీ
తాపమునిండఁగ నేగతి-సైపుదునెచ్చెలి.

ప్రమీల—దారిఁబారిమేరమీఱి చీరికేరిక్రూరుఁడౌ ॥పర॥
మారుశరంబులబారికి సారెకుబడలెదనింక.

32. రాగం-కేదారగౌళ. తాళం-రూపకం.

కనక—తాపమేటికమ్మనీకు-భూపమౌళినిన్నుఁజెందు
సైపవలదేపై దలియీపాటునకోపవిఁక,

అనుబంధములు.

ఖేదముమానుమిక-ఁగాదిది వేళచెలి
నీదాసిని-నేఁడెచ్చెద-భూదాసుని మోదమున. ॥౧॥

33. రాగం-నాదనామక్రియ. తాళంఅట.

మాలతి—దేవియేటికింతనీకు-దీనవాక్యము
కర్జ మెల్లఁదీరెనే-యర్జనుండుపాతెనే
నిర్జరేశుఁడైననేమి నిన్నుమీతెనే.

34. రాగం-నాదనామక్రియ. తాళం-ఆది.

మంజు—ఈవిధినాడెద-వేటికిదేవీ.
కావవెకరుణను-గైకొను మనవిని.
సారసుచరితమె-ధీరవిచారమె-కారణమేమీకలఁక గలుగగా-
ఘోరలీల-విచారమేల-చేకూరదేల యాధారుణివరుకూరిమి.

35. రాగం-కమాజు. తాళం-ఆది.

కనక—వలవదీరీతియోచన-చెలువాతలఁపకు కలగకుమింక. ॥పల్ల॥

నరుడెయదేటికా - సురనాథుఁడు నీచరణదాసుఁడయి సరగు
ననీ-సరసనుబడియడలఁడె. ॥పల్ల॥

36. రాగం-బ్యాగు. తాళం-ఆది.

అంగజుని బంగారు మంగళాంగియీనారి సింగారమంగళాకృతి
-ఁగనువలె- రంగారుచున్నదిగా-యీభృంగవేణి. ॥పల్ల॥

లేదేనిరుద్రాణియో-యా-భూదారపుబోణియో
కాదేనివిరించికాంతామణియొ - యీవేదండగామిని-వాదమేల
కాదుకాదు.

37. రాగం-కమాజు. తాళం-రూపకం.

అర్జు—పరితాపమగుఁజూడుమా
గురుతాప-మీపాప-మేనోప, ॥పల్ల॥

అనుబంధములు.

మునులఁజెందఁగఁగోరు-వనజాక్షులుందురె
కొనసాగ-దనురాగ-మిదిబాగా. ॥౧॥

38. రాగం-బిలహరి. తాళం-రూపకం.

ప్రమీల——తాళఁజాలను నే-బాళిమీఱనీ-పదములయాన-యీలాగుచన-
మేలావల్లభ-వేళాకోళముగద.

అర్జు——బాలాయీవిధము-పోలదెందును - గలిగెడుదురితము-శీలాయీ
వగ-మేలానీమది-కేలాగు తెలియదు. ॥పల్లె॥

ప్రమీల——తాపమూర్పక-ప్రాపుఁజేర్పక-కోపగించిన నేపుమీఱనె యేపా
రగను-గాపాడవోకో-నాపాపమేమియొ. ॥౧॥

అర్జు——నీకుఁజెల్లునె యీకళంకము నాకువింతగు జోకదోఁచెను
యీకోరికలకీకొన్న నను-జీకాకుపరపదె. ॥౧॥

39. రాగం-ధన్యాసి. తాళం-రూపకం.

ప్రమీల——నన్నుగనలకే సఖి నిన్ను వేడెద.
తరళాక్షీ నేబడియెడు-పరితాపమునీవెఱుఁగవు
గురుదాహము జనియించెను-ధరణిమనఁగజాలనింక.

40. రాగం-ముఖారి. తాళం-రూపక.

ప్రమీల——చాలను నే-మనియుండఁగ-నకటా-భూమి కాలగతియె-యీ
లాగను-జాలియేల-బాలలార తెఱఁగుల నే మీ కెయ్యెడ-నెఱిఁగిం
చితినటు చేయుఁడు వెఱువకుడీ యీగతినను-మరచిపోండు
మరచిపోండు.

41. రాగం-పూర్వికల్యాణి. తాళం-ఆది.

మలయ——ఈవిచారమేటికిల తాంగి-మదిలోన
భామరో యూరక-ప్రాణమువాయుట
కీమాటలాడుట-కేమైనదమ్మా ॥౧॥

అనుబంధములు.

వింతవిధంబగు-నింతేటికిఁకనీ
చెంతకుఁదెత్తునీ-చేతోవిభుని. ॥౨॥

42. రాగం-ఖమాజు. తాళం-ఆట.

మలయ } భామాచనదీమానసము
కనక } ప్రేమాయతి నీమాటలనేమాడెద వోమానిని

మలయ — ఇటుతారుమారుగ సారెసారెకు సడలియొడలను బడలిక
డునడలేదు
ధీరామతివై రాజిల-కీరితిగనారీమణి.

కనక — బాలామణియీలోగనె-దాలాభము-వాలాయము
చాలన్వేతదూరంగని కేలామణియీలాగున. ॥౨॥

43. రాగం-ఖమాజు. తాళం-ఆది.

ప్రమీల — తాపమొందఁగజాలనే-సఖియా-తాళఁగలనె పాపమేలయిం
కే-రూపమేమ్మృగాక్షీ. ॥పల్ల॥

మలయ — ఏలాయీగతింబల్కఁగా దేవీ-ఈలాగగునె యాలోచింప
కింత బేలవైతివయ్యో. ॥పల్ల॥

ప్రమీ — భూపమౌళి మోము-జూపువారెలేరె-ప్రాపుజూపినన్ను - కాపా
డువగగలుగదె.

మలయ — లోలనేత్రభూమి-పాలమౌళివచ్చి- మేలునింపఁజాలునీలోనఁ
గడుబడలకు.

ప్రమీల — ఊరకాళఁజూవ-మేరగాదునీకు-నేరంబె-వైరంబెనీరేజ-నయ
నాతగదు.

మల — ఏలదింతవంత-యేలకగ్గెనీకు-లోలాక్షీ-చాలాయెమేలౌనె-విప
రీతగతి. ॥౨॥

అనుబంధములు.

ప్రమీ——బాలా-తాళ-జాల-వేలార్పకము. ॥3॥

మల——అమ్మా-యమ్మా-కొమ్మా-సమ్మోదమగు. ॥3॥

ప్రమీ——మసలక-వెసనా-యసువుల్-వసివాడుఁగద. ॥౪॥

మల——లలనా-వలదీ-లలిబల్వలు కాడఁగను. ॥౪॥

ప్రమీ——కననిక్క ముగా-మనఁజాలను నె - విన వేటికినా-మనవికరుణఁద
నర-నళిన-నయన.

మల——ఇదేనీవెతలం-దుదగాంచెదునె-మ్మదిఁజెందుమునీ- కొదవుముద
ము-మదన-హరుని-కరుణ.

ప్రమీల——కలవాణీ - భరియింపం - బలుతాపం - బరుదయ్యెం-దళితాం
గంబై -యసమానంబై -జ్వాలనాభంబై - విషమంబై -తలఁచిన-
బలువెత-గలఁపఁగ-దలికెద-నులికెదనిదె. ॥౬॥

మలయ——వినుదేవీ - మదిఁగుందం - జనునేవీ-ఆడిభంగిన్-మనసారం
గన్-ఘనమోదంబున్-గొనసాగింతున్-దనరింతున్-నినునిదె-
జనవిభు-నెనయఁగ-మనవిని-వినుగనఁలకు. ॥౬॥

44. రాగం-జంజూటి. తాళం-ఆది.

మలయ——ఇదేలా-యింతవంత-సుందరాంగీ-నీ
ముదంబొదవన్-నేఁడెవచ్చున్-నీవిభుండునీ.

ప్రియానందం-బొందుదాన-వింతలోననే
అయోనీ - తాపమింక - అయ్యయోనీ - తాపమింక-మానుమ
మ్మానీ.

కరాళంబై-తోఁచెమారున్-నీవిధానము
దురాపంబై నభంగిన్-హా-దురాపంబై నభంగిన్-జెందనానెనీ.

అనుబంధములు.

45. రాగం-నాదనామక్రియ. తాళం-రూప.

ప్రమీ——భూమీశుఁడు-నన్ను-గామించునే యాహాహా-
ఈసరసోక్తులు-ల్లాసమునించునె
వాసిగనుపుమీ- మోసఁపుమాటలు

46. రాగం-మాండ్. తాళాం-ఆది.

అందరు——ఏటికింత-తాపమో-చూడనే
మాటికిశో-కమేల-వీడవే.

కనక——చూడఁజాల-నీకునింత-తాపము
వేడిచూపఁ-గాదొకో-పాపము.

మలయ——వానిఁజూడ-నిప్పుడే-పోయెద
మానుమింక-శోకమో-కోమలి. ॥౨॥

మంజు——ఏలరాఁడో-చూడుమా-నీపతి
బాలచాలు-చింతల-పాపవే. ॥3॥

మాల——చింతసేయ-కమ్మరో-వేఁడెద
వంతబోల-దెంచఁగా-దీనికి.

47. రాగం-పూర్వి. తాళం-రూపకం.

ప్రమీల——గంభీరమై-రాజిలె.

వీడగమేఘా-వృటు
వాడగ చందురుడు
అడగకులగిరు-ఆకాశ
యె అల్లు-అడగ-ధారణి సోలగ తారలురాలగా

48. రాగం-పీలు. తాళం-ఆది.

ప్రమీల——భూరమణా రతిగోరుదాన
వాడిశరంబుల వంచనసేయుచు-
న్నాఁడుబ్రదుకఁగా-నీఁడుమారుఁడు.

అనుబంధములు.

49. రాగం-జంఝూటి. తాళం-ఆట.

ప్రమీల—తెరలించెననుమారు-శరములు వేఁడెద
ధరణీపాలకనన్నుఁ గరుణింపవే. ॥పల్ల॥

అర్జు—అతివాతగునె నేను-వ్రతముఁ సల్పెడువాడ
మతముగాదిటులైన-నతిపాపము ॥

ప్రమీల—హయరక్షకై యింత-నియమమువలయునె
ప్రియమారఁగౌఁగిలి-దయసేయవే.

50. రాగం-కమాజు. తాళం-ఆది.

ప్రమీల—నిన్ను వేడుకొందు నే-వన్నె కాడ. ॥పల్ల॥

విన్నాణమున-నన్ను కరుణ-మన్నింఁచగ. ॥అను॥
సమ్మోదమునఁగౌగి-లిమ్మని వేఁడెద
నా-కొమ్మాయనుచు..నెమ్మదిని కానిమ్మనవె.

51. రాగం-కమాజు. తాళం-ఆట.

ప్రమీల—కొలదిగనక మాటలాడఁగా
ఁగలభా-తులువా-సలువా

అర్జు—వెగటుపలుకు లూర కాడఁగా
ఁదగవా-మగువా-నగవా.

ప్రమీల—తులువతనముదీఱఁగనీ
తలనుగోయఁజాలనెవో
నిలుముక నెదునాదుకటారి.

అర్జు—పొగరుమాటలేటికి నే
మగువలయెడ బాణముల
మిగులదొడుగఁజాల నిక్కము. ॥మగు॥

అనుబంధములు.

52. రాగం-కమాజు. తాళం-ఆది.

ప్రమీల—ధరణీ-పాలనన్ను-కరుణఁజూడవే.
నెమ్మదినిన్నే-నమ్మినదాన

53. రాగం-ఇంగ్లషునోట. తాళం.

అందరు—ఆనందంబై చెలంగె మహనీయానందంబయ్యెన్. ॥ పల్లవి ॥

ప్రమీల—ఇలనే-ఁగడుధ-న్యనురమణా.
అర్జు—బలుధన్యుఁడనే-ఁగదరమణీ.
ప్రమీ—విలసిల్లఁగనా-కెనయెవరు.
అర్జు—బలుసంతసమా-యెనుతరుణీ. ॥ ఆనం ॥ (1)
మేఘ—మలయా-వతినా-రతనమరా.
మల—కలయం-గనుమా-మేఘవర్ణా.
మేఘ—చెలువా-రదెసం-తసమతివా.
మల—పొలుపార దెస-మ్మదమనఘా. ॥ ఆనం ॥ (2)
సుయో—ఘనచారుమతీ-ననుఁగనవే
చారు—చనుదెంచెదధీ-రసుయోగా
సుయో—మనసంతసమే-రికిఁగలదు.
చారు—చనదేజనమో-హనగతిగా. ॥ ఆనం ॥ (3)
ప్రద్యు—వడిరాఁగదవే-కనకలతా.
కనక—బడినే-నిదెవ-చ్చితిమదనా.
ప్రద్యు—కడుసంతసమిం-పగుఁదరుణీ.
కనక—నుడువం-దరమే-మనముదము. ॥ ఆనం ॥ (4)
సాత్య—సతిమాలతినన్-దయఁగనవే.
మాల—వెతదీరెనెసా-త్యకిమదిలో.
సాత్య—అతివాకడు సమ్మతిఁగలిగెన్.
మాల—అతిహర్షము పొంగెదెరమణా॥ ॥ ఆనం ॥ (5)



అనుబంధములు.

నీల——మదిరా-జిలెనే-మంజువాణీ.

మంజు——ఎదనీ-లధ్వజ-కడుముదమే.

నీల——సుదతీ-కడుస-మ్మోద యొదవెఁ.

మంజు——మది రాగము నాకిదె యొదవెఁ. ॥ ఆనం ॥

54. రాగం-మోహన. తాళం-ఆది.

అంతరు——జగదా-ధారా-సకలకళా.

నిగమా-లోకా-నిపుణమహా.

సుగుణా-కాంతా-శుభఫలదా.

విగతా-ళీక-విపులవిభా.

మునిజనతా-వరకమలా-సనహరిలో.

చనవినుతా-ఘనసుర.

పాల-పూజ-నీయ-శీల.

ధీవిశాల-మావిలోల.

పావనాల-పావినీల-సేవితేలా.

భూవిభు ధావన-కేవల-పావన-శ్రీవరదా.

రామకృష్ణ-పూజిత॥ జగ॥.

ప్రమీలార్జుననాటకము

సంపూర్ణము.



# ERRATA.



| పుట. | పంక్తి. | తప్పు. | | ఒప్పు. |
|---|---|---|---|---|
| 4 | 16. | యేమిదె | ... | మేమిద. |
| 10 | 7. | శా॥ శాంతిశ్రీ | ... | శా॥ శాంతీశ్రీ. |
| 11 | 13. | ముకుళిన | ... | ముకుళిత. |
| 12 | 8. | స్మానము | ... | స్నానము. |
| ,, | 14. | మిత్రులారా | ... | మిత్రులారా. |
| 15 | 20. | అబలాజనమవుట | ... | అబలాజనమనుట. |
| 17 | 4. | యుద్ధముసమంజస | ... | యుద్ధమసమంజస. |
| ,, | 9. | మణివిభోద్దీతమై | ... | మణీ............ |
| ,, | 15. | పోరుననారితీటి | ... | పోరుననారితేటి. |
| 18 | 22. | ఇంక యుదమేటికి | ... | ఇంకయుద్ధ........ |
| 19 | 15. | మేలు | ... | వేరు. |
| ,, | ,, | వేలు | ... | వేరు. |
| ,, | 16. | తోచిన | ... | తోచునో. |
| 20 | 4. | నరి | ... | అరి. |
| ,, | 6. | విలుచుట | ... | నిలుచుట. |
| ,, | 8. | నుచ్చరింపరాదన ననకుడు | ... | నుచ్చరింపద[illegible]కుడని. |
| 21 | 11. | ఇశ్లేలగల్కుచున్నాను | ... | ఇశేలబల్కుచున్నాను. |
| ,, | 19. | ఈ జాబు | ... | ఈ బాజు. |
| ,, | 19. | ఈ జాబు | ... | ఈ బాజు. |
| ,, | 21. | ఏమిజాబు ? | ... | ఏమిబాజు ? |
| 22 | 9. | యిట్లుండిక | ... | యట్లుండడ. |
| ,, | 14. | లేదేని బాణానల | ... | లేదేని మద్బాణానల. |
| 25 | 9. | యుదమున | ... | యుద్ధమున. |
| 28 | 7. | రాక్షసా ! సంగ్రామము | ... | రాక్షసా ! ఈ సంగ్రామము. |
| ,, | 20. | (ననననలున్నవి.) | ... | వసలెడలుచున్నవి. |
| 29 | 12. | రతికుడు | ... | రథికుడు. |
| 30 | 3. | సేర్పుము | ... | జేర్పుము. |
| ,, | 20. | ఆలాజు | ... | ఆబాజు. |

| పుట. | పంక్తి. | తప్పు. | | ఒప్పు. |
|---|---|---|---|---|
| 33 | 24-25. | సాహృదయపదము | ... | సాహృదయపదమునం |
| ,, | ,, | నంతునగల... | ... | తయువగల. |
| 34 | 29. | యుదమంతయు | ... | యుద్ధమంతయు. |
| 35 | ,, | (తుదిమూడుపంక్తులు) | ... | (పాటగా భావింపవలయును.) |
| 37 | 7. | బాణతురీణముల | ... | బాణతుణీరముల. |
| ,, | 25. | యేయిచ్చిన | ... | మేమిచ్చిన. |
| 40 | 13. | అందతిరహశ్యము | ... | అందలి రహశ్యము. |
| ,, | 28. | (తోసికొని) | ... | (తీసికొని) |
| 41 | 3. | నించుకైని | ... | నించుకైన. |
| 42 | 4. | మేఘవీర్లు | ... | మేఘవర్ణుఁడు. |
| ,, | 14. | యర్ధాంగిని | ... | యర్ధాంగిణి. |
| 43 | 13. | తే॥గీ॥ సంశప్తకాళిఁ | ... | తే॥గీ॥ సంసప్తకాళి. |
| 44 | 23. | సారంగభూషణుడు | ... | సా సాంగ భూషణుఁడు |
| 47 | 7. | శంకారపాత ధీహుంకార | ... | శంకారహితధీర హుంకార. |
| 48 | 7. | ఈముండల్లెర | ... | ఈముండ లెల్లరు. |
| ,, | 9. | నందుకురిధ్వంసము | ... | నందుకుపిరి ధ్వంసము. |
| ,, | 17. | భ్రాంతు మీమీతరుణలు | ... | భ్రాంతులై మీమీ...... |
| ,, | 19. | నాకీతగులాదవినది ? | ... | నాకీతగలమొదవినది. |
| 50 | 7. | పచియుండినందునను నన్నందరు. | | వచ్చియుండినందున నన్నందరు. |
| 53 | 23. | అధర్మజుఁడ ధర్వమునకై విడిచిన పృథివియొక్కటియె. | ... | ఆధర్మజుఁడ ధర్మమునకైవిడిచిన యశ్వము పృథివి ... |
| 56 | 12. | నీకామెతలిచ్చి | ... | నీకానుకలిచి. |
| 57 | 2. | నీనెంత | ... | నేనెంత. |
| 58 | 2. | నింత | ... | నింద. |
| ,, | 21. | ఇంతసే పిట్లుండుదు | ... | ఇంతసేపెట్లుండుదు. |
| 59 | 17. | గారిముడ్డులు | ... | గారిముద్దులు. |
| 60 | 3. | సమ్మతిగాకున్నను సమ్మ | ... | సమ్మతిగాకున్నన సమ్మతి. |
| 62 | 8. | నీయట్టితరలాక్షిపై | ... | నీయట్టితరళాక్షిపై. |
| 63 | 27. | అట్టుకావలసియేవచ్చిన నేమును . . | | అట్టుకావలసియేవచ్చిన మేమును |
| 65 | 20. | సీ॥ హయమేధ...నట్టిపోనియ్యక. | | సీ॥ హయమేధ...నట్టిపోనివ్వక |
| 67 | 16. | దానిచీరపయ్యంట | ... | దానిచీర పైపయ్యంట. |
| ,, | 17. | కన్నులకుఁదటినది | ... | కన్నులకుఁగట్టినది. |
| 69 | 15. | ధీరత్వవిఖ్యాతి | ... | ధీరవిఖ్యాతి. |

| పుట. | పంక్తి. | తప్పు. | | ఒప్పు. |
|---|---|---|---|---|
| 69 | 21. | అయిననామనవి నంతవినుము | ... | అయిననామనవి నింతవినుము. |
| 70 | 14. | నీయింటిఁజూచి | ... | నీయింటఁజూచి. |
| ,, | 21. | కాంతలన్నె నీకవ్వడి | ... | కాంతలనెల్ల నీకవ్వడి. |
| ,, | 30. | ననన్యథా | ... | అనన్యథా. |
| 71 | 7. | నాయలూచి | ... | నాయులూచి. |
| 71 | 17. | నీవాయి నిన్నాడనిచ్చినంతయు | ... | నావాయి నిన్నాడనిచ్చినదంతయు. |
| ,, | 21. | నట్టిదాని | ... | అట్టిదాని. |
| 72 | 6. | త్రికరణశుద్ధిగా నినుసె వరి | ... | త్రికరణశుద్ధిగా నిను నే వరింపను. |

N. B. రెండుమూడు చోట్ల అనుబంధముల నెంబర్లు మారియున్నవి. దయచేసి సవరించుకొనవలయును.

